# హెచ్చరిక

ఈ 'ఉషాసుందరి' నాటకమునకు సంబంధించిన సర్వాధికారములును శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారికి సంపూర్ణముగ చెంది యున్నవి. గ్రంధకర్త లిఖితపూర్వకమైన అనుజ్ఞ లేనిదే

| | |
|---|---|
| స్టేజింగ్ | స్క్రీనింగ్ |
| రికార్డింగ్ | బ్రాడ్ కాస్టింగ్ |
| ప్రింటింగ్ | పబ్లిషింగ్ |
| ఎడాప్టేషన్ | ట్రాన్స్లేషన్ |

మొదలైనవి, పూర్ణముగను, అసంపూర్ణముగను చేయరాదు. భిన్న ప్రవర్తకులు నేరస్థులును, నష్ట పరిహారమునకు బాధ్యులు నగుదురు.



# ఆశీస్సు

బ్రహ్మశ్రీ విద్వాన్ పైడిపాటి సుబ్బరామ
శాస్త్రి గారు "ఉషాసుందరి" యను
నైదంకముల మహా నాటకమును రచించిరి.
నేనీ నాటకరాజము నించుమించుగా నంత
యును విని యానందించితిని. ఇక్కవి
యెంతయో పూనికతో నీ నాటకము రచించె
నని తెలియుచున్నది. ఇది యిప్పటి నూత్న
కవులు రచించునట్టి నాటకముల వలెంగాక
యుత్తమ శ్రేణికిం జేరిన ప్రమాణ నాటక
మని నా బుద్ధికిం గోల దోఁచునది. ఇందు
పాత్రోచితమైన భాషయు భావములు నెల
కొల్పబడినవి. నాటకమునకు రమణీయత
ప్రధానము గాన, దానికిం దెందును లోటు
పాటు కానిపించుటలేక రసస్యంది యగు
చున్నది. ఇందు పెక్కు స్థలములందు ధ్వని
ప్రధానమై మనోహరమగుచున్నది. మఱియు
నిందుఁ గొన్ని కొన్ని స్థలములందు చిన్ని
చిన్ని వ్యావహారిక పదములు నెలకొల్ప
బడినవి. అవి నాటకమునకు వన్నె దెచ్చు
చున్నవనియే నేఁ దలంచితిని. ఈనాటకము
సమగ్రముగ నిర్వహింపఁబడుటం జేసి
యిక్కవిని కవిరాజుగా నే నాశీర్వదించు
చున్నాను.



కవిసార్వభౌమ: శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

20—7—1945.



## పురుష పాత్రలు :

బాణాసురుడు,

అనిరుద్ధుడు

నారదుడు

శంకరుడు

కృష్ణుడు

బ్రహ్మ

కుంభాండుడు

## స్త్రీలు :

ఉషాసుందరి

చిత్రరేఖ

రాణి



త్వరలో : కృష్ణదేవరాయలు (నాటకము)

# నాంది

శ్రీ యుమా శారదా రాగ సించితములు
హరి హర హిరణ్యగర్భ హృత్సరసిజములు
మధుర మధురంపు తావి సంపదల పొదలి
విశ్వకల్యాణ రోచి ప్రవిభవించు.

(సూత్రధారుడు ప్రవేశించి)

సూత్ర : నటీ! నటీ!

నటి : ఇదే! వచ్చితిని. బావా! కల్యాణమని వినవచ్చినది. వివాహ మెవరిది ?

సూ : అది ప్రార్థనా శ్లోకము. దంపతీ తాంబూలము నృత్తాయని యనుకొంటివా ?

నటి : అది మాత్రమేది? పెళ్ళియన నాకెంతో సరదా! దంపతీ తాంబూలము పుచ్చుకొను వేళ మీరు లేనందుకు నాప్రాణము చివుక్కుమనినది. మొన్న మీరు మావారింటికి రానేలేదు కదా!

సూ : అబ్బ! ఏమిటి! పోనీ నీవైన చేయించి వచ్చితివి కదా! బాగుగా జరిగినదా ?

నటి : ఆ! ఏదో! జరిగినది. మూడుముళ్ళు పడునప్పటికి గగన మైనది.

: అదేమి ?

పెళ్ళియన్న ప్రక్కనే విఘ్నముండును. ఏ పెళ్ళియు పూర్తి యగువరకు అయినదనుకొనుటకు వీలులేదు. ఎక్కడో అక్కడ పేచీ తప్పదు.

సూ : పరిణామ సుఖమున్న ప్రక్క విఘ్నముల కేమిలే.

నటి : బావా! యీనాటి నాటకమేది ?

సూ : పెళ్ళినాటకమే కావలెనా ?

నటి : తమకక్కర లేనట్లు; సభికులు వేచియున్నారు. త్వరగా సెలవిండు.

సూ : చూడు మీ చిత్రపటము; విరహిణి ఉషస్సుందరిని అనిరుద్ధ తేజస్కుడహస్కరుడాశ్లేషించుచున్నాడు. ముద్దరాలు కౌగిలిలో కరగిపోయినది.

నటి : ఓహో ! 'ఉషాసుందరి' నాడతలచితిరా ?

సూ : ఇది శ్రీ సుబ్బరామశాస్త్రిగారి రచన. అనగా తెలియునా ?

నట : తెలియును. ప్రత్యక్షరము పూనికతో నటించెదను. పరిషత్తు మెచ్చిన కదా తమరు నాతో మాట్లాడుట ! ఏమా దివ్య గానము ! అప్పుడే దేవఋషి నారదుడు ప్రవేశించినాడు. మనమిక్కడ తడయరాదు.

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.



# ఉషా సుందరి

## 1 వ అంకము — 1 వ రంగము.

[నారదుడు త్రిమూర్త్యాత్మకముగ గానము చేయుచు ప్రవేశించును.]

(తెరముందు)

నా జనకుడు హిరణ్యగర్భుడు విష్ణుని కుమారుడే కదా! శైవులును వైష్ణవులును పరస్పర ముఖావలోకనముననే గాఢభజస్నాను కలుగు ననుకొందురు. ఒకరికి శివాలయము స్మశానము; వేరొకరికి కేశవాలయము వ్యభిచారగృహము. నాకిరువురు నొక్కరూప. ఈ భేదము లోకమున నేల కలిగినది? ఇంగితమేల లుప్తమైనది? ఆ మహామాంత్రికుల ఒకప్పుడు తమతమ క్రియావిశేషములచే నాధిక్యతాగర్వమును అంతరాంతరముల చెందకయుందురా? వారి వారిజాతుల కి- ఇంతయే కదా! అబ్బా! యీ ఉబ్బు నేను సట్టలేను. ఒకతూరి శివకేశవులు సిర్ణయింపుకొనిన నేను చూడవలయును. తత్త్వానంద భంగకరమగు యీ ఊహ నాకిప్పుడేల కలిగినది? హావిధీ?...

(నిష్క్రమించును.)

(తెర యెత్తుదురు)

ఉష: కాని- అంతిమ విజయు మాలినిదే కదా!

చిత్రరేఖ: అవును. ఆతడు మాయలమారి.

ఉష: చిత్రా! నావంక చూడుము. మాయలకు పెట్టినపేరు మనమా? దేవతలా! మాటవరుస కందును. నీ దగ్గరనున్న శక్తులు దేవతల దగ్గర సైతమున్నవా? కాదు చెలీ! దైవము వారిసొమ్ము.

చిత్ర: ఉషా! మనదైత్యులంతయు సక్రమముగనే చేయుదురు. కొట్టకొన కేదో తెలివితక్కువ పని చేయుదురు. దానితో క్రుంగి పాతాళమునకు పోదురు.

ఉష: రావణుడు బ్రహ్మయంతవాని మనుమడు కద! మహాశివభక్తుడు కద రాజ్యపాలనా ధురంధరుడు కద! చివరకు నరునిచే ఓడిపోయెను కద!

# ఉషాసుందరి

## 1 వ అంకము — 2 వ రంగము

[శివుని కీర్తించుచు నారదుడు ప్రవేశించును. బాణుని తపస్సు]

నార: ఈ తపోదీక్ష ఎవ్వరిది? శోణాధీశ్వరా! బాణా!

బాణుడు: ప్రణతులు దేవమునీ!

నార: అరివీరభయంకర సహస్రబాహావిక్రమ శోణాధీశ్వర బాణాసుర సార్వభౌమ ఈ కారడవి నే ప్రయోజన మర్థించుచున్నాడవు?

బాణ: బ్రహ్మ మానసపుత్రులు, త్రికాలజ్ఞులు తమకు తెలియని దేమున్నది?

నార: (ఆలోచించి) దివ్యాస్త్రలాభమా! ఈని తపోగ్నికి ముల్లోకము లల్లాడిపోవుచున్నవి. శంభుడేల ప్రసన్నుడు కాలేదు? (మరల ఆలోచించి) బాణా! నీ తపస్సు ఫలించినది. నిముసములే అంతరము.

బాణ: దేవమునీ! తమ అమోఘాశీర్వాదము. అతిలోకసౌందర్యవతి గారాబుపట్టి ఉషాకుమారిని వదలి, పరాక్రమోపేతులు పుత్రులను విడచి యీశరీరము కృశింప ఈశ్వరదత్తములైన సహస్ర బాహువులతో నంవత్సరములుగా శివార్చనము చేసితిని. నేటికిని స్వామికి కరుణ కలుగలేదు.

నార: బాణా! నీపట్టుదల నిట్టిమైనది.

బాణ: నారదమునీంద్రా! మీ తండ్రిని మెప్పించిన మా కుదుటివాడు హిరణ్యకశిపుని కార్యదీక్ష ఎట్టిది? పొందినవరము లెట్టివి? అవి నిష్ఫలములు కాలేదా? ప్రపంచమును జయించవలెనను అభిప్రాయము నాకులేదు. కాని ఏనాటికిని విష్ణువు మా దైత్యులను బ్రతుకనీయడు. నిజము చెప్పుము; సముద్రమథనమున శ్రమ మెవరిది; ఫలిత మెవరిది? దేవతలు రాక్షసులకు న్యాయమే చేసిరా?

నార: బాణా! నేను దేవమునిని కదా!

బాణ : అయినను నీయందు మా అసురజాతికి విశ్వాసముకలదు. తమకును మాయందట్టి యభిమానమే కలదు.

నార : బాణా ! మీతండ్రి బలిచక్రవర్తి దానధురంధరుడనిపించు కొనుటకు పాతాళమునకు దిగత్రొక్కబడుటేమి ? ధర్మవిరుద్ధము కాదనియు చిన్నియబద్ధమాడిన సర్వము నిలచుననియు అది విష్ణు మాయ యని విస్తరించి మొత్తుకొనినను ఆచార్యుడనియు శుక్రుని వినక మూర్ఖించెను. అట్టి పరిస్థితులలో మా దేవతలే దైన్యముచో నేనేల యుసవలె ; నేనేల యుసవలె...

బాణ : నిజము నారదమునీ !

నార : ఒక తండ్రి బిడ్డలము కయ్యమేలనయ్యా అని మొత్తు కొందును. ఇరువురును వినరా ? విష్ణువు నా పితామహుడనియు నేనాతని కీర్తింతుననియు మీవారు నమ్మరు. నేనున్న దున్నట్లు చెప్పిన కలహశీలినని మావారు దూషింతురు.

బాణ : దేవమునీ ! తమరు మాకును కావలసినవారు. దైత్యుల కీ యెద్దడి తప్పు ఉపాయ ముపదేశింప రాదా ?

నార : ఏమి యుపాయము కావలెను ?

బాణ : శంభుని వరము వేడవలయును కదా !

నార : సత్యము. కాని మీపూర్వులు వరము వేడుటలో నొక్కొ-క్కరిదుం నొక్కొక్క దోసమున్నది హిరణ్యకశిపుడు, పగలును రాత్రియు నరునిచేత మృగముచేత భూమిని ఆకసమున, ఆయుధముకల లేని పదార్థములచేత చావకూడదని చాలవర యోచించి వరము వేడినాడు. విష్ణువు సంధ్యాకాలమున నరసింహాకృతి భూనభోంత రాళమున నఖములచే చీల్చి చంపెను. ఇట్టి యపకారమునకు స్థానము లేనిదిగా వరము కోరవలయును. నీబుద్ధికి నీవే ఆలోచించుకొనుము. నేను పోయెదను.

బాణ : దేవమునీంద్రా ! అట్టి యుపాయము నాకు తోచుట లేదు. తమరే సెలవీయవలయును.

నార : ఇదియేమి ఆశ్చర్యము బాణా! నేను చెప్పిన బాగుండునా? ఈశ్వరు డేమనుకొనును? విష్ణువేమనుకొనును. నేను పోయెదను. (అని పోబోవును.)

బాణ : తమ పాదములకు మ్రొక్కెదను. వెల్లడింతునా దేవమునీ! రహస్యముగ నుపాయము సెలవిమ్ము. (అని పాదముల బట్టుకొనబోవును.)

నార : బాణా! నీ తండ్రి బలిచక్రవర్తి విష్ణుని 'కాపలా' యుంచుకొనినాడు.

బాణ : (నిశ్వసించి) చక్కని యుపాయము. దేవమునీ! ఆజన్మాంతము నీకు కృతజ్ఞుడను. త్రిశూలధారి నా రక్షకుడైన చో చక్రము చక్కిలమే. కాని మునీ! ఇది యపరాధము కాదా? పరమేశ్వరు నట్లు కోరవచ్చునా?

నార : ఇందులకే నేనేమియు నింతవరకు చెప్పలేదు. ఇప్పుడును చెప్పలేదు. నారదుని నెత్తిని ఊహాంశము వేయుట సులభము. దైత్యాధీశ్వరా! పోయివచ్చెదను.

బాణ : దేవమునీ! క్షమింపుము. నేను సందేహము కలిగి ప్రశ్నించితిని.

నార : పిచ్చివాడా! భగవంతుడు భక్తపరాధీనుడు కదా! భక్తరక్షకుడు కదా! అంతకన్న కోరునదేమున్నది? నీవేమి గర్వముతో విఱ్ఱవీగెదవా?

బాణ : ధన్యోస్మి.

(నారదుడు నిష్క్రమించును.)

(బాణుడు తపస్సులో కన్నుమూసికొనును. శివుడు తాండవించును.)

బాణ : (కొంచెము కదలి) ఏమి యీ అపూర్వ సౌరభము? సమాధిని నిలువనీయకున్నదే. (నిశ్చలుడు)

శంక : బాణా!

బాణ : (మరలకదలి) ఏమి యీనాడీ విచ్చిత్తి! ఇంద్రుడు మాయ పన్నెనా? (నిశ్చలుడు)

శంక: బాణా!

బాణ: (కదలి) ఏమి యీ రసధ్వని?

శంక: బాణా! అనుగ్రహింపబడితివి.

బాణ: స్వామీ! నేను సమాధిలో లేను. తమరూపము...?

శంక: చర్మచక్షువులతో చూడగలవా?

బాణ: శివానుగ్రహ విరాజిని కదా!

శంక: బాణా! (అని హస్తముతో మంత్రించును)

బాణ: (కండ్లు నెమ్మదిగా తెరచి) మహాదేవా! ఎంత కాల మునకు. చెదరియుంటిరి. ప్రభువులు సంధ్యానృత్య మొనర్చిరా? లోకకల్యాణి, సర్వమంగళ అమ్మవారలసినది. యీ సహస్రబాహువులు పునీతములుగా పీవనలు పట్టనా? (అనివీచును)

శంక: బాణా! నీభక్తి నిరుపమానము.

ప్రతి నిమేషము నొకలక్ష పత్రిపూజ
రాసులయ్యెను తెమ్మిహారములు నతము
అగు ప్రతిదిన సహస్రఘుటాభిషేక
మిట్టి భక్తాగ్రణికి నెవ్వరీడు నీకు.

బాణ: జటామకుటపినద్ధశశి ప్రస్వేద పరసీమ
గరళస్థ హాలాహలరోచి సిరస్తహారినీలమణి
స్వసోస్రితసీ తరంగములు హృష్టాంతరంగములు
సస్తవిన్యాస ఫణిమణి సజీవాలంకారము.

శంక: బాణా! నీ వాంఛితము?

బాణ: ఇట్టి సుందరమూర్తిని అంతరంగమ్మున సర్వదాబంధించు ప్రభిమ యీ బాణునికదమ్యగ్యము. మహాదేవా, నేత్రోత్సవముగా—భక్తపరాధీనుడవు కదా, భక్తరక్షకుడవు కదా! నా నగర ప్రాంగణమున నాకు రక్షగా నుండుము.

శంక: తథాస్తు. కాని దైత్యులలో నీవుమాత్రమే చూడగలవు. (చేతులెత్తి యాశీర్వదించును.)

(తెరపడును.)

# ఉషాసుందరి

## 1 వ అంకము — 3 వ రంగము.

[అంతఃపురము : ఉషనిద్ర, చిత్ర సఖి ప్రవేశము.]

చిత్ర: (స్వగతము) నాగమణి ప్రచ్ఛన్నప్రచ్ఛయడిగి విసికి వేసారి నది. ఉషాసుందరి నానాటికి కృశించుచున్నది. ఈ రాత్రి యిచ్చట ప్రత్యేకముగ పరుండి వేగుతీయగలనా? (పరుండి నిద్ర నటించును.)

ఉష: (కలవరించుచు) సెలయేరు రజితప్రవాహామా? ఆహా! వెన్నెల వెలుగుల జిలుగులు.

చిత్ర: ఆలాపన- సామాన్యమే!

ఉష: పల్కులు కలకండలు.

చిత్ర: వేనివి? చిలుకలవా?

ఉష: ఈ తోటలబాట లెంతవాటములు!

చిత్ర: సాయంవేళ తోటలో విహరించితిమి కదా!

ఉష: మల్లెల్లు నెత్తావులీ మల్లియలు.

చిత్ర: ఇదియొక రకమైన కవిత్వధోరణి.

ఉష: వలపు లొలికించు నీ సొంపములు.

చిత్ర: సొంపముల జోలియేల? వలపనును- వలకాక కాదుకదా?

ఉష: మనోహరా! నీవుకట్టిన పూవుల రథమిది.

చిత్ర: మనోహరు డెవ్వరు? ఆహా! నిక్కముగ నిది ప్రణయ జ్వరమే. ఎంతకాలమునుండి జీర్ణించినది?

ఉష: అది నీ గడుసుతనము...

చిత్ర: ఏమి? నన్నుకాదుకదా! ప్రియునికాబోలు!

ఉష: నేర్చితివిలే చాలు! ఎవరైన విన్న నవ్వుదురు.

చిత్ర: నేనొక్కతెనే కదా విన్నది?...అర్థమైనది; ఇది మదన తంత్రము.

ఉష: అబ్బా! ప్రభాతము? (అని కదలును)

చి త్ర : (బిగ్గరగా) సఖి ! ఇంకను కాలేదు.

ఉష : కాకపోవుటేమి మనోహరా ! అటుచూడుము.

చి త్ర : (బిగ్గరగా) కాదు సుందరీ ! ఇది అర్ధరాత్రము.

ఉష : (కండ్లు తెరచి చిత్రరేఖను చూచి సిగ్గున తలవాల్చి) నీ వెప్పుడు వచ్చితివి ?

చి త్ర : నీ నిద్రలో

ఉష : నా కెట్లు మెలకువ వచ్చినది ?

చి త్ర : ప్రభాత మయ్యె ననుకొనుటవలన. లేకున్న సుఖభంగ మయ్యెడిది కాదు.

ఉష : (ముఖము చిట్లించి) సాకూతముగ మాట్లాడెదవేమి ? సుఖభంగ మేమి ?

చి త్ర : నిద్ర సుఖకారిణి కదా !

ఉష : మరి నీవు నిద్రపోయితివా ?

చి త్ర : కలలతో నిద్ర సరిగా పట్టునా ?

ఉష : నీ కేమి కల వచ్చినది ?

చి త్ర : నేను నిద్రపోయితినట. నీవును నిద్రపోయితివట. నీకు కలవచ్చినదట. "మనోహరా నీవు కట్టెసపూవుల రథమిది. అది నీగడుసుతనము ! నేర్చితివిలే చాలు. ప్రభాతమైనది." అని ఏమేమో కలవరించితివట ! నే "నిది యర్ధరాత్రి"మని యేమో అంటినట. ఆ మాటలే బిగ్గరగా వచ్చినవి కావలయును! మెలకువ వచ్చినది. నేను లేచునప్పటికి నీవును లేచితివి. నిద్రలో నిద్ర ! సఖి కల నిజమైనది.

ఉష : (తనలో) కల నిజమైనదా ? మంచి ఉపశ్రుతి. (బిగ్గరగా) నీవు చిత్రకారిణివే కాదు. కవయిత్రివి కూడ.

చి త్ర : ప్రభువులును, రాణియు నీ కృశించుటకు కారణ మరయ జాలకున్నారు.

ఉష : నేనంత చిక్కితినా ?

చి త్ర : సగమయితివి.

ఉష : సర్వాంగము తెల్లమైనది కదా !

చిత్ర : శిరస్సులేని శరీరము.

ఉష : అదేమి ?

చిత్ర : నామధేయము బయల్పడ లేదు కదా !

ఉష : నాకు మాత్ర మేమి తెలియును ?

చిత్ర : పేరుచెప్పుటకు కల్యాణ సమయమున సిగ్గిలిన లజ్జ— యీ చెవిలో...రహస్యముగా...

ఉష : నే నన్నృతమాడనని చెప్పుకొనవలయునా ? చిత్ర రేఖా !

చిత్ర : పోనిమ్ము. ఆతడే దేశమున కేలిక ?

ఉష : ఒకటి తెలిసిన రెండవది తెలియుట సులభమే.

చిత్ర : ఏమి యీ చిత్రము సుందరీ ?

ఉష : చిత్రాతి చిత్రము చిత్రరేఖా !

చిత్ర : సమాగమ మెచ్చట సుందరీ ?

ఉష : స్వప్నగతివనీ నిశాంగణమున.

చిత్ర : ఎట్టివలపు చే సొలసిపోతివి సుందరీ ! (అని నవ్వును.)

ఉష : నవ్వుల రువ్వి యెద సదలింపకుము. ఆతని విలాసములు (అని అర్ధోక్తితో విరమించును.)

చిత్ర : కావ్యవస్తు వో కానొకట కల్పితమగునట్లే ఆతడును స్వప్న గతమూర్తి కదా ! సృష్టిలో నుండి యుండవలయునన్న నియమ మేమున్నది ?

ఉష : ఇందేదియో దైవనిర్దేశమున్నది. లేకున్న ప్రతి రాత్రమును అదే రూపమున స్వప్నమున (సిగ్గు) నాతో విహరించు టేమి ? నీవును నేనును మాటాడుకొనుట ఎంత సత్యమో అది యంతకన్న పరమ సత్యము. చిత్రా ! నన్ను వెల్లడి చేసెదవా ?

చిత్ర : నీ ప్రాణసఖి చిత్రరేఖ మంత్రి కుంభాండుని పుత్రిక. నా శరీరము నీ సుఖమునకే నిర్మితమైనది.

ఉష : రేఖా ! నా ప్రాణమునకు నీ కళాపాటవము ఆధార చక్రము.

చిత్ర : చెలువ ! నీకన్న ఏమికావలయు నాకు
అసురజాతికి మరి యసాధ్యంబు కలదె!
ఇట్టి సంకల్పదీక్షమ రూపెత్తదేల ?
ఇదె ప్రయాణము మదవతీ ఎరుగుమమ్మ

దిగ్దేశ రాజన్యుల చిత్రములచే నీ యంతఃపురము నలంకరింప చేసెదను. నా తూలికతో నీ పోలికను నీకండ్ల యెదుట నిలిపెదను పదపడి తదుపరి కార్యక్రమము.

ఉష : భవానీ యమ్మలు ననుగ్రహింపుము. (పాడుదురు)

(తెరపడును.)



# ఉషా సుందరి

## 2 వ అంకము — 1 వ రంగము.

బాణ: శంకరా! నిన్ను విడచి నేనొక్క నిముసమును మనజాల కున్నాను. నానాటికి మనబంధము దృఢమగుచున్నది. నీవు నాకు ప్రాణమిత్రుడవు కదా!

శంక: (తనలో) ఈ భక్తుడు సమాన ప్రతిపత్తితో మాటాడు చున్నాడు. (ప్రకాశముగా) సందేహమేమి?

బాణ: యుష్మద్దత్త సహస్ర బాహా సంపత్తి సమూల హిమా చలోత్పాటన శక్తికలది.

శంక: ఇతనికి నానిలయమునే పెల్లగించు ఊహ కలిగినది. (ప్రకాశముగా) బాణా! నీ నగర సంరక్షకుడనే యగుదును.

బాణ: శంకరా! నా బాహా పరిభూతములే ముల్లోకములు. అస్మద్భుజాటోపమునకు తగిన పని లేదు. (విచారముతో) ప్రతిభటుడు లేడుకదా!

శంక: (తనలో) ఈ భక్తుడు కించిత్తు గర్వించుచున్నాడు. బాణా! నీ ఐశ్వర్యము నీకు మదావహము.

బాణ: శంభుడా! నీవు నానగరమునకు గస్తి. నే నడచినది లోక మునకు భీతి. అస్మద్భుజా కండూతి నానాటికి హెచ్చుచున్నది. ఇట్టి నా పరాక్రమము వ్యర్థమై పోవలసినదేనా? పురారీ! నీవైన పోరాడరాదా?

శంక: (దర్పముతో) బాణా! ఏమనుచుంటివి?

బాణ: (వికటముగ నవ్వి) దివస్పతివలె జటాజూట ఘటిత శశాంకుడు గజగజలాడుచున్నాడు. అమ్మవారు హడలిపోవుచున్నది. నేనంత మూర్ఖుడనా? సిగపూవు కందనీయను. అర్ధశరీర మంటను. శంభుడా! వినోదముగా పోరాడుదమురా!

శంక: (త్వరితముగా) వలదు బాణా!

బాణ : శంకరయ్యా! ఇంతభయపడెదవేల? నెత్తిన నోరుపెట్టుకొని సెలుగుచున్నది; గంగాదేవినికూడ ముట్టనులే. నా యుద్ధలాఘవము చూతువుగాని పోరాడుదువురా.

శంక : బాణా! వలదు. వలదు. వలదోయీ

బాణ : నీవు సగ మాడుదానవు. నా నగరము నెట్లు రక్షింతువు? శంభయ్యా, రావయ్యా! నీ గమొడలిపై పురుగునుకూడ ముట్టనులే.

రారా శంకర మల్లయుద్ధమునకున్, రావేమిరా శంభువా
పోరన్ భీరుడవైతివేమిర మృడా. పో[illegible] నీ బీరముల్
రారా నా భుజశక్తి చూచెదవు, లేరా సాహసమ్మెక్కి, ఓ
గౌరీ శంభుడ! ఏమి కావలెనురా ఉల్లోక [illegible]ర్ధతుల్.

శంక : (కినిసి) రాక్షసుడా! నీ వెవ్వరితో మాటాడుచుంటివి? ఒడలు మత్తెక్కి రెచ్చిపోవుచుంటివి. కారులు ప్రేలెదవా? ప్రగల్భములాడెద వేమి కరములు? కరము లట! కరములు!

ఈనా డిట్టుల కండకావరమునన్ ఏ బాహుసంపత్తిచే
బాణా రెచ్చితొ, నీదు భుజమ్ములను నిర్వర్తించు, నొక్కండుగా
యీనా యంతటిమేటి- యంతపని నేనే చేయగచాలుదున్
కానీ- వృక్షము [illegible] నరుకంగా గాను, తా పెంచుటన్.

నీ కేతనపతనమే భుజాఖండనమునకు నాంది.

బాణ :

ఏమి సరసము విరసమ్మైనదా!
అతి పరిచయముచే స్వాతంత్రించితిని
తారతమ్యము గుర్తింపనైతిని కదా!
ఏమి చేసితిని- అజ్ఞాన మావరించినదా?
విజృంభితిని కాబోలు! స్వామీ స్వామీ స్వామీ.
అపరాధము అపరాధము అపరాధము.

(తెరపడును.)



# ఉషాసుందరి

## 2 వ అంకము — 2 వ రంగము.

[ఉషాసుందరి విరహాతురతో కూర్చుండును. పాట]

చెలువము నీదిరా ప్రణయసీమవు నీవుర, ప్రాణవల్లభా
కల నగుపించి, తీయని సిగారపు కూరిమి సంతరించి, ఊ.
యెల, మరగించినట్టి కళలే కరవైనవి, మేలుకొల్పులన్
వలపుల పిండినట్టి ప్రభువా! కరుణింపుము డోయిలించెదన్.

వలపులరాయడా! మొదటివారను నీకయి తీసియుంచితిన్
సలసల క్రాగు వెన్నెలలజాలికలె నాపయి దండడించెదున్
నిలువగలేనురా యిటుల, నీకడగంటి కృపాప్రసారముల్
చిలికెదవా సుఖల్ మధురసీమల కోమల పుష్ప శయ్యలన్.

(చిత్రరేఖ ప్రవేశించును.)

ఉష: వచ్చితివా నాప్రాణ సఖీ చిత్రరేఖా!

చిత్ర: సుందరీ! ప్రాణము లేచివచ్చినట్లున్నదే!

ఉష: నియతకృత్యమునందు కృతార్థురాలవైతివి కాబోలు!

చిత్ర: సుందరీ! హృదయము పదిలపరచుకొనుము.

ఉష: చిత్రా! కన్నుల కరవుతీర నీ కళానైపుణిని చూడగలను.

చిత్ర: అవును. నీవాంఛితార్థమును చూడగలవు.

ఉష: చమత్కారిణివి చిత్రరేఖా.

చిత్ర: ఊర్ధ్వలోకవాసులను తొలుత చూపుదునా?

ఉష: (అంగీకారమును సూచించును.)

చిత్ర: గంధర్వకిన్నర కింపురుషులందురే. సంగీతకళాకోవిదులు వారే వీరు.

ఉష: అటులనా?

చిత్ర: (ఉష ముఖముచూచి పుట తెరచి) యౌవన స్వేచ్ఛా విహారులు సిద్ధసాధ్యచారణ గణమిదే.

ఉష: ఓహో,

చిత్ర: సౌఖ్యసంపదు పేతులు. మగత్తులను యుకులను విందావు కదా. చూచితివటమ్మా వీరిని?

ఉష: చూచితిని.

చిత్ర: వీరు కామరూపులైన పన్నగులు సుందరీ

ఉష: సరే.

చిత్ర: నీహృదయ సామ్రాజ్యాధిష్ఠానము మధ్యమలోక స్థితమా? చూడు సారసాక్షి! వీరు మాళవ నేపాళ బంగాళ పాంచాల దేశాధీశులు.

ఉష: ఆ!

చిత్ర: వీరు కొంకణ టెంకణ త్రిగర్త సుధేష్ణ మరాటలాట దేశాధీశులు.

ఉష: ఊహూ!

చిత్ర: వీరు కురు బర్బర సింధుయుగంధ రాంధ్ర కహూశ నిషాద ఘూర్జర సాళ్వ భోజ దేశాధీశులు.

ఉష: ఓహోహో!

చిత్ర: కాకుండిన వదలు వేయుము. పరిహాసమేల? మగధదేశాధీశ్వరుడు— ఈతని ధాటి కృష్ణునికి బాగుగా తెలియును. వింటివి కదా బృహద్రశ్వసుతుని జరాసంధుని— చూడుమమ్మా?

ఉష: బాగు బాగు.

చిత్ర: యుద్ధ కుశలి, భీష్మకసుతుడు విదర్భాధీశ్వరుడేమైన కలలోనికి వచ్చెనా?

ఉష: ఇప్పుడుచూచిన కలలోనికివచ్చినట్లే యున్నాడు.

చిత్ర: ఈతనికి విశేషించి సైన్యమును పరాక్రమమును కలదు. ఈశ్వరుని మెప్పించి శూలమును సంపాదించెను. ప్రాగ్జ్యోతిషాధీశ్వరుడు భగదత్తుడందురే.

ఉష: తరువాత పుట—

చిత్ర: పేరువాసుదేవుడు. ఈతనికి చక్రి అబ్జ గదాది చిహ్నాములున్నవి. కృష్ణుడన్న మచ్చరించి మండిపడును. పౌండ్రకుడీతడే సుమా!

ఉష : అవును, బురదపామును పామే. (నిశ్శ్వసించి) ఏమి–రేఖా! పటములన్నియు నయినట్లున్న వే ?

చిత్ర : సుందరీ ! సత్యసంధులు భుజావిక్రములు విజయోపేతులు పంచపాండవులను చూచితివా ?

ఉష : చూచుచునే యున్నాను.

చిత్ర : రాజరాజు దుర్యోధనుని చూచితివా ?

ఉష : ఈ అసువులు నిలుచునా ?

చిత్ర : చూడుసఖీ ! ఈతడు బలరాముడు ఈతడు కాడుకదా !

ఉష : కాడుసఖీ ! ఈకల నాకేల రావలయును ?

చిత్ర : ఈతడు కృష్ణుడు సుందరీ ! ఈతడైనను ?

ఉష : కాడు సఖీ. కాడే ! అబ్బ ! !

చిత్ర : రుక్మిణీసుతుని ప్రద్యుమ్నుని చూచితివా సఖీ.

ఉష : (పరీక్షగా చూచుచు నిశ్వసించి) రేఖా ! కొన్ని పోలిక లున్నవి. కాని యాతనిగా నేను నమ్మలేను ! అవ్వ ప్రతిదినము ! (సిగ్గుతో) నా మనోహరు డదియొకరకముగా నుండునే చెలీ !

చిత్ర : అయిన నిది చూడుము. (అని పుట త్రిప్పును)

ఉష : (చిత్రరేఖ కన్నులలో చూచి) రేఖా ! రేఖా ! రేఖా ! (అని పటమువంక చూచి హృదయమునకు హత్తుకొనును. మరల తెరచి యదేపనిగా చూచును.)

చిత్ర : నన్ను పిలచి చిత్రమును కౌగలించుకొనుటేమి సుందరీ !

ఉష : చిత్రరేఖనే కౌగలించుకొనవలెను, రా ! సఖీ ! నిన్నే కౌగలించుకొననిమ్ము (అని కౌగలించుకొని వదలి) ఆర్యపుత్రుని నామధేయము రేఖా !

చిత్ర : ఎదపదిలించుకొంటివికదా ! ఆతని నేయడుగుము చెప్పును.

ఉష : నీవు ప్రాణ ప్రతిష్ఠ చేయుము. అట్టులే యడిగెదను చెలీ ! నాకూరిమికాని పేరు ?

చిత్ర : ఏమో !

ఉష : ప్రాణసఖి ! బ్రతికింపుము. వీనులు మనోహర నామసుధా రసమునకు దప్పిగొనియున్నవి.

చిత్ర : చెప్పిన నాకేమిచ్చెదవు సుందరీ ?

ఉష : రేఖా ! యిచ్చుటకు నీదికాని దేది ? మెచ్చెదనుచాలదా? గ్రుచ్చి కవుంగలించెదను చాలునా ?

చిత్ర : అబ్బా ! ఎంత చేసెదవు ?

చెలియ ! అంతత కొకవింత చెలువ మొలికి
కల, నిగారపు వలపులు కలియబోసి
తొలుత నే లేత నీ యెద దోచినట్టి
ఘాత పనిరుద్ధు డమ్మ విద్యామహాస్వి.

ఉష : అయిన కృష్ణునికి.

చిత్ర : అవును– పరాక్రమవంతుడైన పౌత్రుడు.

ఉష : సఖి ! ఆతడెట్లు మనకు...

చిత్ర : (నిస్పృహతో) కష్టమే.

ఉష : నీవే యిట్లనిన చిత్రరేఖా !

చిత్ర : సుందరీ ! నీ జనకు డేమైన నిచ్చగించునా ? కృష్ణుడు దైత్యారి కదా ! ఇది స్వప్నప్రాయమే యగును.

ఉష : స్వప్నప్రాయమైన సుఖాంతమే. ఇది జరిగితీరవలసిన దే, లేకున్న...

చిత్ర : ఎట్లు సుందరీ ?

ఉష : ఉషాకుమారి యిక లేనిదేనా ? (అని ఏడ్చును).

చిత్ర : ప్రాణసఖి ! నీ కజ్జల ధారను నేను చూడలేను. నా శక్తిని నీకు ధారపోసెదను. తదుపరి ఏమయినను సరే ! తెప్పిరిల్లుము.

ఉష : మనోహరా ! (అని పరధ్యానమున నుండును.)

చిత్ర : ఊరడిల్లుము సుందరీ ! నీ మనోహరుని తెచ్చెదను.

ఉష: తెచ్చెదవా రేఖా! నీవేనా అనునది. ఆహా! నీవు తేగలవు. కాని ఎట్లు తేగలవు?

చిత్ర: యోగవిద్యా ప్రభావమున నిద్రాముద్రితుని చెక్కుచెదర కుండ తీసికొని రాగలను.

ఉష: నిజముగా! నా చిత్రరేఖా! తీసికొని వచ్చెదవా! ఏదీ ఇటుచూడుము. (అని కన్నులలో చూచి) నిశ్చయముగా నీ కనులు తీసికొని రాగలిగినట్లే యున్నవి.

చిత్ర: రహస్యముగ నంతఃపురములో నాతని దాచవలెను. ఇది బయలుపడిన ఏమగునో తెలియునా?

ఉష: పొమ్మా. ప్రాణసఖి పొమ్మా. (చిత్ర నవ్వును.) రేఖా! తీరా ఆతనిని తెచ్చిన నాతడు నన్నేల్లు నను మాటేమి?

చిత్ర: నిన్ను కాదను పురుషులును కలరా?

రసము లొలికించి బులిపించు రాజసంపు
తళుకు బెళుకుల వాలు చూపులకు కరగి
పరవశమ్మయి పోలని వాడు కలండె?
పలికెదవు గాక గోలవై కలత నెలత!

ఉష: పొమ్మా ప్రాణసఖి! పొమ్మా, అడుగులు మరియింత వేగముగా...

పాట (తెరపడును.)



# ఉషాసుందరి

## 2 వ అంకము — 3 వ రంగము.

[తెర ఎత్తునప్పటికి కృష్ణుని యెదుట నృత్యము. నారద ప్రవేశము.]

కృష్ణు : దేవమునీ! నాగేహము పావనమైనది. ఇదే అస్తకణము.

నార : నీదియొక విచిత్రమైన జీవితము కదా !

కృష్ణు : విశేషమేమి మునీంద్రా !

నార : ఏమున్నది ? మొన్న దేవలోకమునకు పోయితిని.

కృష్ణు : దేవరాజు కుశలమా ?

నార : ఏమి కుశలము ? ఈశ్వరుని నగరపాలకునిగా చేసికొనిన బాణాసురుడు ప్రళయాదిత్యుడైనాడు. ఆతనికి యుద్ధభేరియు విజయభేరియు నొక్కటే. నీయన్న దేవేంద్రుడు 'దాసోహం' మనినాడు. రంభ తిలోత్తను, ఘృతాంచి, మేనక వారి పాట్లు యగచాట్లు వారికే ఎరుక. అంతయు భీభత్సమైనది. దివస్పతి జాతకము ఒడుదుడుకులతో కూడినది.

కృష్ణు : ఇది యీశ్వర వరప్రభావము.

నార : ఆతడు ఉబ్బులింగడు. రాజనీతి యనిన నీదే కదా! అబ్బా! ఇట్టివెన్ని నవరించుకొని వచ్చితివి ?

కృష్ణు : దేవేంద్రు డేమైన చెప్పెనా ?

నార : ఏమని వాకొనగలడు ? నీవు చూచుచునేయుంటివి కదా! అని మాత్ర మనెను.

కృష్ణు : నీవుండియు నాతని వారింప లేదా ?

నార : నేను దేవమునిని కదా ! నేను వారించిన నామాట శిరసా వహించునా ?

కృష్ణు : బాణు డంత గండరగండ డయ్యెనా ?

నార : దేవేంద్రునకే దిక్కులేనప్పుడు మిగిలినవారిని తడవనేల ?. ఆతనికి, యీశ్వరుడు మనకు రక్షకదా ! ఈ వసుంధర నరచేత పిండ

లేమా! యన్నంత 'ధీమా' కలదు. నీవును ఆతనిదృష్టిలో ఆనినవాడవు కాదు.

కృష్ణు: ఏమి నారదా?

నార: తెలియును. నీ పరాక్రమము నాకు తెలియును. కాని ఆతనికి తెలియుట కవకాశ మెక్కడిది?

కృష్ణు: అవకాశమే కలుగకుండునా?

నార: ఏమో! ఎప్పటి మాట! యీనాటికి దేవేంద్రుని గని చూడుము.

స్వర్గసీమను కల సర్వ సౌఖ్యములను
బాణ విభు స్త్రీల తో సమర్పణము సేసి
ఏ కతమ్మున కంటికి నెట్టిజీర
కలుగునో యని చేతులు కట్టి నిలచు.

కృష్ణు: నారదా! ఇది బాణాసురునికి నిజముగా క్షేమమేనా?

ధర్మము త్యజించి యతడు సుధర్మ గెల్చి
యాక్రమించిన క్షీణించు నయ్యు తుదకు?
గోడుమని యేడ్చు ముప్పదిమూడుకోట్ల
సురల యుసు రది చిచ్చుల కురియుగాని.

నార: ఏమో! ఆతని పరాక్రమము చూచిన ఏమని చెప్పుటకును వీలులేకున్నది. ఆతనిపై దండెత్తుటకు తొలుత ముక్కంటితో పోరాడ వలయును కదా! కాని ఇది ఒక పెద్ద సమస్య.

కృష్ణు: నారదా! దీనిని కాలమే పరిష్కారము చేయును.

నార: పోయి వచ్చెదను.

కృష్ణు: నమస్కారము.

(నిష్క్రమించును.)

(తెరపడును.)

★

# ఉషా సుందరి

## 3 వ అంకము — 1 వ రంగము.

[అనిరుద్ధుడు నిద్రలేచును. ఆశ్చర్యముతో.]

సరస చెలి లేదు- వజ్రమందిరమ ? కాదు
ఎఱిగినది కాదు పో అలంకరణ సరణి
పరువులెత్తెడు సౌధ ప్రవాళ శోభ
స్వప్నమా ? కాదు వ్యత్యస్త సరణి ఏల ?

ఇయ్యది ద్వారక కాదు. కారాగారమును కాదు. ఇందలి రహస్య మేమి ? (బిగ్గరగా) ఎవరు ?

చిత్ర : ఏమి సెలవు ?

అని : (తనలో) ఏమి యీపె లావణ్యము ? (ప్రకాశముగా) మే మెచ్చట నుంటిమి ?

చిత్ర : అంతఃపురముననే యున్నారు కదా !

అని : అవును. అనగా

చిత్ర : అనగా అనగా శోణపురమున.

అని : (తనలో) ఇది బాణాసురు నేలు రాజ్యము. నా మన స్సామ్రాజ్యాధిష్ఠానము నారదుడు వచించిన ఉషాసుందరికిని నాపై వలపు కలదా ? మేమిచ్చటి కేల తీసికొని రాబడితిమి ?

చిత్ర : స్వామీ ! నాకును తెలియుట లేదు.

అని : ఏమి యీ వైచిత్ర్యము.

చిత్ర : కాకేమి.

పూర్ణవిధు గాంచి వారిధి పొంగులేల
వారిధింగాంచి యాపగ పరువులేల
అందరానట్టి దూరస్థ డతనియందు
పద్మినీకాంత కేల ? విప్పారుయెడద.

అని : ఏమి చమత్కృతి.

చిత్ర : స్వామీ ! (అని చిత్రముపై తెర తీయును.)

అని : ఏమి యీనాస్వపుణ్యము. ఇట్టి నా రూపచిత్రము నా అంతః పురమున నైతము లేదే! బహుశుమానార్హ కళోపాసకులను మే మెరుగ గోరుచున్నాము.

చిత్ర : ఈ దాసురాలు. ఏలినవారి యంతఃపుర మిదియే యేల కాఁకూడదు ?

అని : (తనలో) అగుటకే కదా తెచ్చినది. (ప్రకాశముగా) అసురకాంత లెంతకు తగరు ?

చిత్ర : తగినవారికే కదా యిందు ప్రవేశము !

అని : రాగవతి! (అగ్గి ఖి)

చిత్ర : క్షమింపుడు... రాజకుమారీ !

అని : (తనలో) యీపె రాజకుమారి కాదేమి ?

చిత్ర : రాగవతీ! జాగేల ? ప్రాణనాథునిపై అలుకలా ? (ఉష వెనుకకు తగ్గుచు ముందరకు వచ్చెను.)

అని : (తనలో) ఏమి యీ జగన్మోహనసౌందర్యము !

తరుణి పేగెపు వలపు ముందరకు సాగ
కలిగి సిగ్గరితనము వెన్కకును లాగు
యీ వరారోహ నడలు శైల్లింపు లగుచు
వరవడిని తీర్చు రాయంచ పక్కిగమికి.

చిత్ర : ప్రభూ ! అది యెట్టి స్వప్నమో ! మాచెలి యొంటి ప్రాణముతో నిలిచియున్నది కదా !

ఉష : చిత్రరేఖా ! ఏలనే యీ ప్రసంగము.

అని : (తనలో) అహాహా ! శుకాలపము !

చిత్ర :

కోయిల కూసినన్ బెదరు కోమలి, తుమ్మెద పిండు రేగినన్
హా ! యని కర్ణరంధ్రముల నంతనె మూసెడు, మందమందమై
వాయువు వీచినన్ ఉసురు పైపయి లేచినటుండు-అట్టె-నా
థా ! యని సోలిపోవును వ్యథన్ విరిశయ్యను పూర్ణిమానిశన్.

అని: (తనలో) నాకు నేనే మనవలెను. (పరిహాసముగా) పాపము!

చిత్ర: ప్రభువులకు దాక్షిణ్యము అలంకారమే కదా! చెలీ! నీ భాగధేయము పండినది.

అని: రాక్షసులయందు దాక్షిణ్యము చెల్లునా?

చిత్ర: రాక్షసులు ప్రాణులు కారో! సమత్వము సహృదయ లక్షణమని తామెరుంగనిదే. వరణీయులనే వరించిన మా రమణీ మణిని కరుణింపరా?

ఉష: (తనలో) దుర్గా భవానీ! ఉష జీవించుచో పసుపుకుంకుమలు నీ పాదాంతికమున రాసులైపోవు నమ్మా!

అని: చిత్రరేఖా! అనిరుద్ధు నంతటి వానికి శత్రురాజ మందిర మున సల్లాపము రాజనీతియా? అంతఃపుర ప్రచ్ఛన్న విహారము దాత్తమా?

ఉష: (చిత్రరేఖ చెవిలో నేదియో చెప్పును)

చిత్ర: ఆర్యాపుత్రా! దేవరను కోరి రప్పించినది ఉషాసుందరి. యోగబలమున తెచ్చినది యీ దాసురాలు. తమరు మా వాంఛిత మును మన్నించు టనుదాత్తమా? ఇందు తమకీర్తి ప్రతాపములకు కళంకము కలుగునా? బాణాధీశ్వరులకు తెలియు నవసర మేమున్నది?

అని: ఒకవేళ తెలియుచో?

చిత్ర: యీ దాసురాలు తమకు చెప్పదగినదా! తమరు పరా క్రమవంతులు కదా!

అని: చిత్రరేఖా! చాతుర్యశీలమైన వాఙ్మాధుర్య మాకర్ణించు టచే నింతవరకు సైరించితిని. రూపపట లేఖనా నైపుణి బహూకృతిగా అంతఃపుర చౌర్యాపరాధమునకై నిన్ను శిక్షింపక విడిచిపుచ్చు చున్నాను. కాని నియోగించిన హేతువున నిప్పట్టున మీ చెలి దండ్య రాలు. ఇందుల కేమందువు?

చిత్ర: అనుట కేమున్నది ప్రభూ! ఒకవేళ నేరము చేసెనే యను కొందము. అట్లేల యనవలె; నిజముగా నేరమే చేసినది. విధించు శిక్షను తత్త్వము ననుసరించి యంతర ముండవలయు నన్నది తమ బోంట్లకు జ్ఞాతపూర్వము.

మా యుషాకన్య యతి సుకుమారి యగుట
తాళజాలదు బాహు బంధమ్ము కాని ;
వలతి నన్నిట— ఏమి శిక్షలు విధింతొ
ప్రణయ రాజ్యాధిపతి కింత పలుకవలెనె !

చి॥ చెలీ ! నీవిట్టి శిక్ష ననుభవింప నీ చెలి చూచుచు నూరకుండ గలదా ? ఇచ్చట నిలచుటకును కాళ్ళాడకున్నవి. మా ఉషా పోయి వచ్చెదను.

ఉష : ఇది యేమి యన్యాయమే చిత్రరేఖా ! నన్నును తోడుకొని పోవే. నీకు పుణ్యముండునే !

చిత్ర : రాగోరిన అధికారులనే వేడుకొనుము.

అని : రేఖా ! మీ చెలికి పశ్చాత్తాపము కలుగునా ?

చిత్ర : ప్రభూ ! తాము హిమవంతులు (ఉషతో) సుందరీ ! నీ పెంచిన రాచిలుక ప్రాణేశా ! అనిరుద్ధా ! యనుచున్నది. తోడి చెలి కత్తెలు విన్న మోసమువచ్చును. దానికమ్మగింజల తినిపించి వచ్చెదను. పోయివత్తునమ్మా. (నిష్క్రమించును.)

ఉష : నన్నొంటరిని చేసిపోవుచుంటివటే చిత్రరేఖా ! (అని పో బోవును. అనిరుద్ధు డడ్డగించును.)

అని : మా సాన్నిధ్యమున నీ యొంటరితనమెట్లు ?

ఉష : ఆగవే ! చెలి ! చిత్రరేఖా ! అవ్వ... ఇది యేమే (పో బోవును, అనిరుద్ధుడు నిరోధించును.)

అని : నన్నుమాత్రము ఒంటరిని చేసిపోవుట యుక్తమా ? ఈ రాజ్యములును, భోగములును మేమరిగినట్టివే ?

ఉష : మాటున నున్న బోటీ ! నేరని ముగుదను శిక్షించు టుచితమే యనరాదటే !

అని : ఇదియా ! నీ సంశయము. నీబోటి మాటున లేదు. మా కభిముఖులు నేరనివారును కారు. అట్లయినను నేరనిచో శిక్ష యవసరమే కదా ? (అని స్పృశించును.)

ఉష : నేను కేవలము పరవశ నైతిని.

అని : ఇక్షు శరాసనము తునాతునకలైనది.

పాట (తెరపడును.)

# ఉషాసుందరి

## 3 వ అంకము — 2 వ రంగము

[ఉద్యానవన విహారము : ఉషపాడును.]

చిత్ర : ఆగుమాగుము. వెనుకటివలె కాదే- రెండు గొంతుకలు వినబడుచున్నవే.

ఉష : ఏమి వెడిదానవు ? రెండు గొంతుకలు కాదు; మూడును మరల వినుము. (పాడును.)

అని : (ప్రవేశించి శ్రుతికలిపి) అవును మూడును.

చిత్ర : మరచితిని. దేవీ ! నాగమణి యిప్పుడిటకు వచ్చుచున్నది. నేను నెమ్మదిగ నామె కెదురేగి యామెను రాకుండ చేసెదను. యిప్పటికే కాలవిలంబనమైనది. (నిష్క్రమించును.)

(ఉషానిరుద్ధులు పాడుచు విహరింతురు.)

ఉష : ఒక్కచో మొలచి కొమ్మలతో పెనవైచికొను యీ మారేడు రావి యెంత సొగసైనవి.

అని : మన నేస్తమువలెనే ! ఋతువు లారును మన శృంగార వనమందు పూల తొడిగినవి.

ఉష : ప్రియా ! ఇట్టిప్రేమ ఏల కలుగవలెను ?

అని : సూర్యుడేల ప్రకాశించవలె ? పూవేల తావిని చిమ్మవలె ? నది ఏల ప్రవహించవలె ?

ఉష : నాథా ! తమ్మువిడచి నేనొక్క నిముస మోపగలనా ?

అని : ఓపగలిగిన దెవ్వరు ? ఓపగలిగిన వారిని నీ వాపగలవా ! నీ యెడద పంజరమున బంధించి...

ఉష : ప్రాణేశ్వరా !

అని : ప్రాణమా !

ఉష : అల్లదె తర్జనికి సూటిగ తమ్మిపూవు కడ తుమ్మెదను పరికించితిరా ?

అని : అచ్చెరువేల ?

ఉష : జనకా ? తిలకము నిలుపవా ? (అని ఏడ్చును.)

బాణ : కుత్సితురాలా ! అసురజాతికి తలవంపు తెచ్చితివి. నీ పాట్లు నీవు చూచుకొనిన చాలును.

అని : నిరాయుధుని చంద్రహాస ఘాతమునకు బలి యిమ్మనుట బాణాసురుని యుద్ధనీతి. పరాక్రమగర్వోత్సేకము. ఓహో ! బాణప్రభు వెట్టి రణశూరుడు ? ఎన్నాళ్లకు వింటిని ? ఎన్నాళ్లకు కంటిని ?

బాణ : నీ నీటుకు నీమొలకూరుడ నెన్నవలెనా ?

పొగరు తలకెక్కి నీవంతి పురిని చొచ్చి
కాంతలను ప్రేపెలె చేల ? నిష్కారణముగ
నుండి యుగటిమి కలదా ? నీ తాతకంటె
నాగలను పెండ్లి- యిదిగో ఖడ్గమ్ము గొనుము.

(అని వేరుఖడ్గ మందిచ్చును.)

అని : మామా ! పెండ్లి యీవరకే అయినది. పొగరు, తలకెక్కి నేనే వచ్చితి నేమో ! ముఖమున్నది అదృష్టమున్నది. మావంగడమును స్ఫురింపజేసుటకును నీ కధికారము కలదా ? రుక్మిణీకల్యాణము నొక్క మారు జ్ఞప్తికి తెచ్చుకొనుము. నాతండ్రి, మామ వజ్రనాభుని చంపి నాడు. ఈ వంశాచారము నాకును వచ్చునేమో యని సంశయించు చుంటిని. లేకున్న . . .

బాణ : లేకున్న వెలగబెట్టుదువు. మాటలు కోటలు దాటు చున్నవి. నే నెవరో తెలియునా ? డింభకాగ్రహమా ?

అని : నీ వెవ్వరైన నేమి ? డింభకుడు డింభకు డందు వేమి ?

దర్పితోన్మత్తమైన మత్త మాతంగ మెంత
పదను తేరిన సింగంపు కొదమ యెంత ;
అద్రి పెరిగెడు పెను కొండ గుట్ట లెచట
పిడుగు పాటెచట ? శక్తికి కొలత కలదె ?

నేను సిద్ధము (అని కత్తి నెత్తును.)

ఉష : (ఏడ్చుచు) ప్రాణేశ్వరా! మీరు నా జనకులు. ఒకరు తనువు; ఒకరు ప్రాణము. నేను పోరాటమును చూడజాలను. నాపై ఆన.

అని : (కత్తిని దింపును)

ఉష : (కత్తిని లాగికొని) కృపాణమా! సంగ్రామ మూలకందమును పెల్లగించి వేయలేవా? (ఆత్మహత్యకై కత్తి నెత్తును.)

చిత్ర : దేవీ! నీవెట్టి హత్యకు పాల్పడుచుంటివో తెలియునా? (అని కత్తి లాగుకొనును) ప్రభూ! తమరు సర్వజ్ఞులు. తమరి కెదురు లేదు కదా! పునరాలోచనమునకై ఈ దాసురాలు మనవి చేసుకొనుచున్నది.

బాణ : (అభిమంత్రించి) డింభకా! నీ ప్రాణము లెప్పటికిని నా చేతనే కలవు. నిన్ను నాగపాశమున బంధించుచున్నాను. విడిపించుటకు నీ తాత దిగిరావలెను. ఎవరురా అక్కడ? ఇతనిని కారాగారమునకు ......

(తెర పడును.)



# ఉషా సుందరి

## 4 వ అంకము — 1 వ రంగము.

[నారదుడు, శంకరుడు - తెరముందు]

నార : శంభో ! తమ రిది యేమి ?

శంక : ఎరుగవా ? నారదా !

నార : ఏదీ, ఎట్టెట్టూ ?

శంక : బాణాసుర తపః ఫలితము.

నార : దేవా ! తమ కైలాసమేమైనది ? తమకు శోణనగర రక్షకత్వమా ? యుద్యోగము.

శంక : నారదా! రక్షకభటత్వమే! నా భక్తులకు నేను దాసుడను. వారి తపస్సునకు నేను రసింతును.

నార : కాని- ఇట్టి వెందేని కలవా ? (అని ముక్కుపై వ్రేలు వేసికొనును,)

శంక : నారదా ! వాంఛితములు బహుముఖములు.

నార : ఇట్టివాడు రేపు వెన్నునితో తమ్ము కయ్యమును కోరడను మాటేమి ?

శంక : నారదా ! నగర రక్షణ విధియందు నేను ప్రవర్తిల్లక తప్పదు కదా !

నార : భక్తరక్షణ కళాసింధూ! నమస్కారము. పోయివచ్చెదను.

శంక : శివం భూయాత్ .

(తెర యెత్తుదురు : బాణుడు—రాణి.)

బాణ : అది యసంభవము.

రాణి : ప్రభూ ! కనికరింపరా ? గారాబుపట్టి కిక నీరము వదల వలసిన దేనా ?

బాణ : ఇది శుభాగ మొన వేగనా ?

రాణి: ప్రభూ! తాము సుంత యోజింపుడు. ఇం దేమంత నేర మున్నది? స్త్రీపురుషుల కన్యోన్య ప్రేమ స్వభావము కదా. ఇంతకును తమకది శత్రువర్గమే! యను సందేహమే కాని— లేకున్న తాముసు హర్షింపరా?

బాణ: కృష్ణుడు నాకేనా శత్రువు? అసురజాతి నంత మొందింప సమకట్టిన కిరాతుడు. ఆతని నామము వినుటకును ఉచ్చరించుటకును మచ్చరించు నాకా నీమాటలు?...

రాణి: స్వామీ! యీ రెండుజాతులకును వైర మంత మొందు మార్గము లేదా? ఏనాటికిని యీ జాతుల ప్రజలు సుఖములపై చేతల వైచుకొని నిద్రించురోజులు రావా? యుగములుగా యీ పోరాటము సాగవలసినదేనా?

బాణ: విధి యనుల్లంఘనీయము.

రాణి: పౌరుషమున ప్రయత్నింపరాదా? యీ సంగ్రామ నాటకమున నుషాపరిణయమే భరతవాక్యమేల కారాదు?

బాణ: రాణీ! ఎన్నియెన్ని మహాసామ్రాజ్యపు స్వర్గములు దానవజాతి చరిత్రలో కృష్ణవంచకగర్వమునకు బలిదానమైనవి? ఆ స్మృతులింకను చెరగలేదే! ఆ పాపపు స్వర్గమును భగభగలాడించు కృత్యములకు హేతువు; ఆ కిరాతుని కరాసి ఖండించి [illegible] నాకు మనశ్శాంతి కలుగునా?

రాణి: స్వామీ! పగయనునది మనోధర్మము. పెంచిన పెరుగును; త్రుంచిన తునుగును. తమ రాచపోకడలకై ముద్దుపాపని ముద్దుకూతును బలిపెట్టుట న్యాయమా?

బాణ: (నవ్వి) పిచ్చిరాణీ! ఒకజాతి శ్రేయస్సుకంటె ఒక జీవి శ్రేయస్సు ఏమంత గొప్ప? నాకు మాత్రము కడుపు తీపిలేదా? ఏమది? వారుగో నారదులు!

(బాణుడు లేచి యాహ్వానించును. నారదుడు కూర్చున్న పిదప దంపతులు కూర్చుందురు.)

బాణ : స్వామీ : సమయమునకే విచ్చేసితిరి. అనిరుద్ధు డిచ్చట నంతఃపురద్రోహము చేసినాడు. ఫలితముగ నతడు బందీ. చూచితిరా శ్రీకృష్ణ సంప్రదాయము? శోణపురమున నే యిట్టివి పుట్టెనన్న వారి దుండగమునకు మేరయే లేదు.

నారద : ఏమి యీ విస్తారము.

రాణి : స్వామీ! పరాయి యమ్మకన్న బిడ్డడని యాతనిపైననే నేరమును మోపుట నా కభిమతము కాదు. ఈశ్వర రక్షితమైన యీ నగరమున దానవ ప్రచోదన లేకయే యాతడెట్లు రాగలడు?

బాణ : ఏమీ ?

రాణి : కడుపు చించుకొనిన కాళ్ళపై బడును. అనుకూల దాంపత్యము దోషాకరము కాదుకదా!

(చిత్రరేఖ ప్రవేశించి)

చిత్ర : ప్రభూ! కారాగారమున అనిరుద్ధుని వీక్షించుట కొరకు మా ఉషాకుమారి దేవర యనుజ్ఞ వేడుకొనుచున్నది.

బాణ : వినరాదు. వీలు లేదు. కట్టడి చేయవలసినదె.

(చిత్ర నిష్క్రమించును.)

రాణి : మునీంద్రా! అతని శత్రువనని బంధించినను వారు దంపతులు కాకపోరు కదా! సంతసింపదగిన సమయమే! తొలిచూలే!

బాణ : హరహరా! (అని చెవులు మూసికొనును) అసురజాతి కాగర్భశత్రుని అల్లుడని పిలుచుటకన్న ఆత్మహత్య కలదా?

నారద : నిజమే.

రాణి : జరిగిన దానిని బట్టి, పిలువక యున్నను కాకపోవునది కలదా?

నారద : వాస్తవమే.

బాణ : ఈ పరాభవమును నేను సహింపగలనా?

నారద : యథార్థమే.

రాణి : ఏమి మునీంద్రా ! తేల్చరేమి ?

నార : అదియే ఆలోచించుచుంటిని.

రాణి : నేను దాంపత్యమును చీలతీయువల దందును.

నార : అదియును బాగుగనే యున్నది.

బాణ : కృష్ణుడు బాణప్రభు నింతకంటె చేయగలిగినది లేదు.

నార : అవును. ఇంతకంటె చేయగలిగినది లేదు. (ఆలోచించి) ఏమో ! అనిరుద్ధుని బంధించితిరి కదా !

బాణ : ఏమీ ! యీశ్వర రక్షితుని నన్ను తేరిచూడ కలరా ? (ఆలోచించి) జగత్ప్రళయ సూచనలు కన్పించుచున్నవి. తమయూహ వాస్తవమే కావచ్చును. (ప్రక్కకుచూచి) సమస్త సైన్యములను కట్టాయితము చేయుడని మంత్రి కుంభాండుని కుత్తరువు.

నార : అయినను ముక్కంటిని గెలిచిన పిదప కదా ! కృష్ణునికి నీతో యుద్ధము.

(తెరపడును.)



4 వ అంకము — 2 వ రంగము.

కృష్ణ: నమస్కారము నారద మునీంద్రా! దయచేయుడు (కూర్చొనును)

నా: విశేషము లేమి?

కృ: అనిరుద్ధ కుమారుడు గుపడుటలేదు. నాల్గు నెలలైనది.

నా: ఎట్లెట్లు.

కృ: ఒకరోజు తెల్లవారునప్పటికి రాత్రి సుఖశయ్యను నిద్రించి అనిరుద్ధుడు మాయమయ్యెను. ఇంచుకయును జాడ తెలియలేదు.

నా: నేను శోణపురమున కరిగితిని.

కృ: అందేమైన నుండెనా?

నా: బాణనందన వలచి చెలి చిత్రరేఖచే తెప్పించెను.

కృ: ఓహో! రాక్షసులతో పొత్తా!

నా: తమరు ప్రపితామహులు బగుదురుకూడ.

కృ: అపహరించవలసిన అవసరమేమి?

నా: మరి బాణు డంగీకరించునా?

కృ: అయిన నిది రహస్య వ్యాపారము. బయల్పడకుండునా?

నా: బయల్పడినది.

కృ: ఫలితము.

నా: అనిరుద్ధుడు బందీ.

కృ: హా! అనిరుద్ధ కుమారా!

నా: బాణు డిట్టివాడని నేను నాడే చెప్పలేదా కృష్ణా!

కృ: ఇదియేమి ధర్మము? వలచినది రాక్షసులు. అపహరించిన వారు. బంధించినది వారు.

నా: ఆతని వనవలసిన అవసరమేమున్నది? ధర్మ సంస్థాపకు ఉపేక్ష ఎంత లోకోపద్రవకరము?

కృ: ఆహా! నేటి కాలమున దుర్న్యాయము పరిపక్వమైనది.

నా: అయిన దనుకొనుటకును వీలులేదు. ముక్కంటి యాతని బంటు.

కృ: ఆతడు మాత్ర మధర్మముగా పోరాడునా?

నా: ప్రస్తావనలో ఆమాటయు వచ్చినది! భక్తరక్షణము అనగా బాణరక్షణమే నా కవశ్యవిధి యనెను.

కృష్ణ:

ఫాలనేత్రుడైన బ్రహ్మదేవుడైన
ఇరువురైన వచ్చి యేమి కలదు?
ధర్మమున్నచోట తప్పదు విజయంబు
తప్పదింక నాకు తాపసేంద్ర.

నా: శివకేశవ సంఘర్షణము లోకోపద్రవకరము. కాని ఏ విధముగ చూచినను తప్పునట్లు లేదు.

కృ: రాక్షసుల నుపేక్షించుట పామునకు పాలు పోసినట్లయినది.

నా: సందేహమా?

కృ: దేవలోకము నాక్రమించినను ఊరకొంటిని. నా మంచితనమును వారర్థము చేసికొనిరా?

నా: శివకవచధారి కిది మంచితన మగునా? అసమర్థతయే అనిపించును.

కృ: సద్యఃఫలితమునే యనుభవించును.

నా: కృష్ణా! ఇట్టి యెద్దడులలో నీ నిర్ణయమే లోకమునకు ప్రసాదము. ఇట్టివెన్నియైనవి? ధర్మ చక్రమున కధికారివి నీవే కదా!

కృ: మహాప్రళయము రానున్నది. ఎవరురా అక్కడ? శోణపుర ముఖమున రణభేరి మ్రోగింపుమని దండనాథుని కాజ్ఞ.

నా: ఆహా! ఏమి కానున్నదో కదా!

(తెరపడును.)

# ఉషాసుందరి

## 4 వ అంకము — 3 వ రంగము.

[విషాదముతో ఉష]

చిత్ర : దేవీ! ఊరడిల్లుము.

ఉష : పూవు రెమ్మ కళని ఘాత మేల ?

చిత్ర : నాగమణి ఎప్పుడు చూచినదో, వెంటనే సర్వమును ప్రభువులకు చెప్పివైచినది. ఆ దినమున ఒక్కింతముందు నే నెదురేగ వలసినది.

ఉష : జరుగవలసిన దిట్లుండగా నీ వెట్లెదురేగెదవు ?

చిత్ర : రాణిగారు ప్రభువులకెంతయో చెప్పి చూచిరి.

ఉష : తల్లి ప్రాణము కదా !

చిత్ర : నీ శరీరస్థితి దుఃఖమును సైచునా ?

ఉష : ఇక మిగిలినదే దుఃఖము కదా ! ఈ జీవితాకాశమునకు పూర్ణిమ గడచిపోయినది.

చిత్ర : అమావాస్యయు నీటులపెట్టుకొనునా ?

ఉష : వలదనిన ఆజ్ఞగా కృపాణమును దించిన ఆర్యపుత్రుని దృశ్యము అనుక్షణము కండ్లకు కట్టి హృదయమును మెలచుచున్నది. ఆ రణధీరునకు ప్రణయధీరునకు నావలననే కదా ఘోర కారాగార వాసము ! పాపము ఆర్యపుత్రుని మాత యెంత వాడలుచున్నదో ! ఆతని యంతఃపుర మెంత చెన్ను తరిగినదో ! నా ఉసురున కెంతమంది బాధితులో ! ఈ స్వార్థైక జీవి ప్రవర్తన యెంత లోక కంటకము ? అమృతములో చేదుబొట్టు రాలినది. ఫలిత మవశ్య మనుభావ్యము కదా !

చిత్ర : దేవీ ! ఆ జగన్మాతయే మనల రక్షింపగలదు.

ఉష : రేఖా ! ఇంకను నీ కాశ కలదు. ఆశ ఎంత బలీయము ! ఆ అంకురమే లేసనో విషాద జీర్ణ లాక్షణమునసే అంతరింపవలసినదే కదా.

చిత్ర : ఒరిపిడివలననే కదా రత్నమునకు శోభ ! ఈ జీవితని కషణమున నెట్టి మహత్తర తత్త్వము ద్యోతకమగునో ! ఒకప్పుడు సిలుగులు వెలుగు కారణ మగును కదా ! ఇది యొక పరీక్షగా ఏల భావింపరాదు ?

ఉష : ఈ దినమున ఆర్యపుత్రుని స్థితి తెలిసికొంటివా ?

చిత్ర : ఇప్పుడే అరిగి క్షణములో తెలిసికొని వచ్చెదను.

(నిష్క్రమించును.)

ఉష : భవానీ ! సర్వమంగళా ! నా పసుపుకుంకుమలు నిలుపవా ? దేవీ నీవు కదా నాకీవరుని సంధానించినది ! లేనిచో ఇట్టి రూప వంతుని సర్వలక్షణలక్షితుని అంతఃపుర కాంతను నే నెట్లు పొందగలను ? స్వప్నమున ఇట్టి అనుగ్రహముచూపి, లభ్యమగుటలో సాయపడి నేను నే డీరీతి హింసింపబడ తూష్ణీంభావము వహించుట న్యాయమా ? నాడు రుక్మిణీదేవికి సాయపడలేదా ? ఆదిదంపతులు మీరుకాక నా కెవరు దిక్కు శాంకరీ. (అనిపాదములకు మ్రొక్కి కన్నులు తెరచి) దేవీ !

(చిత్ర ప్రవేశించును)

చిత్ర : దేవీ !

ఉష : (వికాసముతో) విశేషము లేవియు చెప్పుకద.

చిత్ర : నీ ప్రాణము క్షేమమే ! నిముసములో నీలో అంత లేచెనో వికాసమేమి ?

ఉష : ప్రాణసఖీ ! భవానీదేవిని ఆర్తితో అనన్యభక్తితో ఆరాధించితిని. ఆ సమాధిలో కన్నులుమూసికొని యున్నవి. ఒక్క వెలుగై దివ్యస్వరూపమై అమృత హస్తముతో ఆశీర్వదించినది. ఏమియో పలికినదికూడ "నీ వల్లభుడు ప్రమాదకృతమున సంభ వించిన శాపకారణమున నాగపాశబద్ధుడు. నీకు శుభము కలుగును" అనిమాత్రము విన్పించెను. ఇప్పుడును వినబడుచునే యున్నది. శాంభవి కృపావృష్టి కురిసినది.

చిత్ర : దేవీ- నే నిప్పు డొక్కమాట వింటిని. కృష్ణుడు స్కంధా వారముతో మననగరమును ముట్టడించె నట.

ఉష : ఏమి విపత్తులు రానున్నవో ! జనకు లార్యపుత్రుని విడిచి పుచ్చి యుద్ధము చాలింపరు కదా !

చిత్ర : ఏమి కానున్నదో కదా !

ఉష : ధర్మము సమరము వలననే నిర్ణయింపబడునా ? మన స్తత్వముల మార్చుటకు యుద్ధము సాధనమా ? ఉషాసుందరి కారణముగా ఇరుపక్షములను రక్తస్రవంతులు పొంగి పొరలవలసిన దేనా ? అమా యిక స్త్రీలు భృతికారణముగ పతిసుతాదుల మాకై బలిపెట్టవలసిన దేనా ? హింసాస్వరూపిణి యుద్ధమారి వేయినాల్కలుచాచి వికృతాట్ట హాసము చేయుచున్నదే ! భవానీ ! నీవు సంకల్ప మాత్రముననే ఇట్టివి సమయచేయగలవు. కరుణాపాంగ వృష్టి కురియవా ?

పాట ( తెరపడును )

# ఉషా సుందరి

## 5 వ అంకము — 1 వ రంగము.

కుంభాండుడు : ప్రభూ! నేల యీనినది. చటులభేరీభాంకారములతో పంచ్రెండక్షౌహిణీల సైన్యము వారణవాజి స్యందన సందోహము బిలబిలా వచ్చిపడినది. గోపురప్రాకారముల కూల్చినది. కవాటముల విరిచినది. పరిఖలపూడ్చినది. యంత్రంబుల దునిమినది.

బాణ : మంత్రీ! అంతటితో ఆగుము. మనరక్షక సైన్యమేమైనది?

కుం : ఎదిరించినది. పోరాడినది. శరశరాసన శక్తిప్రాస తోమర గదాకుంత ముసల ముద్గర భిందిపాల కరవాల పట్టిస శూల క్షురికా పరశు పరిఘాది నిశాతాయుధ వ్రాతములతో ఉభయ కక్షులును తలపడినవి. కాని కృష్ణసైన్యము పట్టపగ్గములు లేక

బాణ : ఆగుమాగుము కుంభాండా! చిరంజీవి బలుపెచ్చుట?

కుం : ప్రభూ! సాంబునితో తలపడి ఘోరయుద్ధము చేసెను. కాని పలాయితుడు. సాంబుడు విజృంభించి

బాణ : తరువాత

కుం : కూపకర్ణుడు కామపాలునితో తలపడెను. నానాస్త్రముల పారించెను. సైన్యముల చీకాకు పరచెను. ప్రళయ ఝంఝా మరుత్తుల వీయించెను. కాని

బాణ : పలాయితుడు - తదుపరి

కుం : ప్రద్యుమ్నునితో కుమారస్వామి ఎప్పుడును ఎవరు వినని కనని ఘోరరణము సలిపెను. కాని కొసకు—

బాణ : ఇక చాలును. అందరును పలాయితులే. కృష్ణునకు ఆటగానున్నది. బాణుడు లేని యుద్ధము యుద్ధమే కాదు.

కుం : స్వామీ! యిప్పటికైనను సంధింపరా?

బాణ : సంధి - ఆ గర్భ శత్రుసితో సంధి. సంధింపకేమి ? నారి సంధింతును ఇక నీవు పోయి చెదరిన సైన్యముల పురికొల్పుము. పొమ్ము .. (కుంభాండుడు నిష్క్రమించును.)

బాణ : నారదుడు యుద్ధమునకు హరునే నియోగింపు మనెను. అదియును ఒక ఊహగనే యున్నది. ఉగ్రా, రుద్రా, కంఠేకాలా, పశ్యత్ఫాలా, మృత్యుంజయా! హా! శంకరా! ఆర్తత్రాణపరాయణా!

(శంకరుడు ప్రవేశించును)

స్వామీ! ఇది ఏమి న్యాయము! తమరిది ఉపేక్ష వహింపవలసిన సమయమా ?

శంక : నీ కేమి కావలెను ?

బాణ : సర్వమును కావలెను. కృష్ణ హతకుడు మా దానవ జాతిని సర్వమును నిర్మూలింప తలచినాడు. ముక్కంటియే నాకు దిక్కు.

శంక : బాణా! పరస్పరము ప్రేమించుకొనిరి కదా! ఫలితమును కలుగనైయున్నది కదా! అనిరుద్ధుని బంధించుటేల? కోరి కోరి కృష్ణునితో యుద్ధమేల తెచ్చుకొంటివి ?

బాణ : ఈ మాటాడునది శంకరులేనా ? స్వామికే ఇట్టి అనుగ్రహము కలిగిన బాణుడింక బ్రతుకనక్కరలేదు. స్వామీ! జరిగిన దానికి విచారించి ప్రయోజనము లేదని నాకు తెలియదా? వారు భార్యాభర్తలని నాకు తెలియదా ?

శంక : మరి సర్వమును తెలియును కదా ?

బాణ : తెలియును. కాని ఆత డనిరుద్ధుడు. అంతఃపురద్రోహము చేసినాడు. ఇది నావంటివానికి తీరని పరాభవము. నాజాతి కవమానము.

శంక : నీ గారాబుపట్టి కపకృతి యొనరింతువా ?

బాణ : నాజాతి గౌరవము పుత్రికా వాత్సల్యముకన్న మిన్న.

శంక : బాణా! కృష్ణునితో పోరాటము సామాన్యము కాదు. అతడు నాయంతవాడు. అనిరుద్ధు డపహరింపబడిన కారణమున ధర్మ మాతనియందే యున్నది. జయము ధర్మాశ్రితము కదా!

బాణ : కృష్ణునియందు తమకుగల అభిమానము నాకు నేటికి వెల్లడియైనది. నేను తమ్మారాధించినది కేవలము విష్ణునితో పోరికై. ఆ ప్రయోజన మాసన్నమైనప్పుడు తమ రాతనితో నేకీభవించి నన్ను వంచింతురా ప్రభూ! స్వామీ! యీ దీనుని యందనుగ్రహమిట్టిదా?

శంక : అదికాదు బాణా!

బాణ : కాకేమి? తరతరములుగా యీ దానవజాతిని సంహరించు కృష్ణుని దుండగములను సహించు తమ్మేమనవలెను? నమ్మించి మోసగింతురా ప్రభూ! తమకు కృష్ణుడన్న మిక్కిలి యభిమానము. లేకున్న తమ సెగకంటిమంట కాత డెట్లువచ్చెనో అట్లే భస్మీ కృతుడు కాడా? నేనే రణరంగమునకు పోయెదను. కృష్ణ హతకుని చూర్ణముచేసి కాని తిరిగిరాను. కాని శంభూ! తమ ఆర్తరక్షణత్వ మేమైనది? వర మేమైనది?– జగత్తున కీవిషయము తెలిసిన చాలును!

శంక : నా వరము జగత్ప్రళయమైనను జరిగితీరవలసినదే.

బాణ : అయిన నగరరక్షకా! బాణప్రభువు నిన్ను యుద్ధమునకు నియమించుచున్నాడు.

శంక : అవశ్యము శిరసావహింతును.

(తెరపడును.)

# ఉషా సుందరి

## 5 వ అంకము — 2 వ రంగము.

[కృష్ణుడు - శంకరుడు - బాణుడు]

కృ: శంభూ! నమస్కారము.

శంక: చిరంజీవ.

కృ: శోణేశ్వరా! వెన్నిచ్చి పరచిన నీ బలమును తిలకించితివికదా! ఇప్పటికైనను సంధింపరాదా?

బాణ: కృష్ణా! అపరాధిని శిక్షింపక వదలుట రాచపాడి కాదు. ఈ బాణాసురునికి గడియకొక నిర్ణయమును లేదు. ఆరంభించినది కొనసాగవలసినదే.

కృ: బాణా! ఎవ్వరికైనను అంతియే. కాని దానిలోని ఔచిత్యమును గమనించునది. మదీయ భక్తుడగు ప్రహ్లాదుని వంశాలంకారమవు. నాచే నీపై కత్తి కట్టింపకుము.

బాణ: ఏమి యీ కనికరము! కృష్ణా! తండ్రిని చంపుటకు కొడుకును లొంగదీసుకొంటివి! ఎంతటి లౌక్యుడవు! నీవు దైత్యులకు చేసిన ఎగ్గులు జగత్తునకు తెలియును. నే నేకరువు పెట్టుట నా ప్రతిష్ఠకే భంగకరము.

కృ: బాణా! నీవు దురభిప్రాయపడుచుంటివి; నే ననవసరముగ ఏ దానవుని సంహరింపలేదు. అతని ప్రవర్తనము లోకోపద్రవకరమగుట వలననే ప్రభుత్వము లోకకంటకమై, ప్రజలే తిరుగబడి నన్ను కారణభూతునిగా నొనర్చుకొనిరి. నాకు సర్వప్రాణులును ఒక్కరూప. నేనే ఆతడైయున్న యీ మహాదేవుని భక్తుడవు నీవు నాకు కూర్చువాడవు కాదా? నీవు స్వర్గమును కబళించితివి. ఏమో! మరల నీవే యిత్తువులే-యని, నేను తటస్థముగనుంటిని. అనిరుద్ధు నేల బంధించితివోయీ! పాపము ఆతని రాణివాసము కార్చు కన్నీటికైనను నీకు కనికరము లేదా? నీ అనుంగుబిడ్డ ఉష ఎంత దురపిల్లుచున్నదో! వియ్యమును కయ్యమునకు దింపితివేమి? ప్రేమైక జీవుల హృదయమందలి రసార్ద్రితనైన గుర్తింపవా?

బాణ : నీ చర్యలే నీ మనుమనికి ఆదర్శమైనప్పుడు, నీవది ధర్మమని చెప్పుటలో వింతలేదు. రాక్షసులే ఆతని తెచ్చినను, అనిరుద్ధునికి యీ వివాహము నా కిష్టమగునను ఆశ ఏ కోశమునను ఉండబోదు కదా! నా సంకల్పమునకు విరుద్ధముగ ప్రవర్తించు ఆతని సాహసము నాకు సైపదగినదా? నన్ను చూచి ఆపెను తానేల తిరస్కరింపరాదు? ఉషాబాల ముగ్ధ; తానో నీవు వచించినట్లు వివాహితుడు, ప్రాజ్ఞుడు...

కృ : బాణా! నీ అనుంగుపుత్రియు నప్రాజ్ఞురాలు కాదు. కోరి వరించిన నెలత నంగీకరించుటయందు దోస మిసుమంతయును లేదు. నన్ను బట్టి అనిరుద్ధుని విరోధియైతివేని, ఉల్లుని బంధించునంతటి ఘోరకృత్య మొనర్చితివని కాని, తల్లిగర్భమునుండియే హృదయము లేక జన్మించితివని కాని ఆత డెరుగకపోవచ్చును. కాని, కాదన్నను బంధుగులము; కయ్య మేల నోయీ?

బాణ : జిత్తులమారీ! బులిపింపు మాటలచే నన్ను మోసగింతువా? శోణనగరమున శోణితవాహినుల ప్రవహింపచేసి, నేడు ముక్కంటితో పోరాడలేక తప్పించుకొను మార్గము నీ చాకచక్యము నెఱుంగనిది కాదు. కృష్ణా! నీవు దైత్యుల కొనర్చిన అపకృతికి శిక్షాఫలితము నేడే పొందగలవు. ప్రభూ! పురారీ! తమరేల? విష్ణుమాయ సర్వజ్ఞుని సైతమాచ్ఛాదించునా?

కృ : బాణా! చెవిటివానికి శంఖమూదితిని. మహాదేవా! తమరు నాతో సమర మొనరింతురా?

శం : కృష్ణా! నేను నగర రక్షకుడను కదా! నీవే నగరముపై దండెత్తి వచ్చితివి కదా?

కృ : ఇది తమకు ధర్మముగ నే తోచెనా?

శం : కృష్ణా! బాణప్రభువు నియంత. నియంతలకు సూచింతుము కాని శాసింతుమా?

కృ : ఈ నియంత అధికారము వెగటై ప్రజానీకము యీ బాధ నుండి తమ్ము విముక్తులను చేయవలసినదిగా ఘోషిల్లుచున్నది.

నేను నాయకత్వము వహింపక తీరినదికాదు. నామనుమని బంధించి బాణునకు కట్ట త్రాళ్ళ తెచ్చుకొనినాడు.

శం: కృష్ణా! నా సమక్షమున బాణుని నిందించుటయు నాకు సైపతగినది కాదు. నీకు చేతనైన అని సల్పుము.

బాణ: మహాదేవా! నీ పల్కులకు పంచభూతములును మెచ్చినవి.

కృ: గరళకంఠా! నే నింత తడవు ప్రసంగించుట అవసరము నదో కాని, నీకు వెఱచికాదు. బాణునసును జడిసికాదు.

> బాణుని బంటువోడ సిగపట్టులు పట్టెను కృష్ణుడన్న యీ
> న్యూనత కేను కొంకెదను నూనము- నీకయి జంకువాడ నే
> దానవ పక్షపాతివి-యధార్థమెరింగిన నీవుగాడ, నీ
> పూనిక యెట్టిపాటిదె! ప్రభుండదె బాణుడు శాసకుం డహో.

బాణ: ఆ! స్వామీ! నీవాక్చాతుర్యము. తత్త్వమెఱుంగక భక్తసులభుని భక్తరక్షకుని బంటనియెదవేమి? ఆతడే నాకు వల్లభుడో నేనే స్వామికి శాస్తనో-మా ఉభయులకే తెలియదగిన; సంబంధించిన విషయము. మహాదేవుని దూషింతువా! శివ! శివా!

> శివుని పేరెత్తి యెవడు దూషించువాడొ
> వాని శిరమది వేయిగా పగులవలదె
> శంకరునిబోలు దైవమ్ము జగతి కలదె
> కరుణ వారాశి యెవరు ముక్కంటి సాటి?

శం: బాణా! నీకేటికీ తొందర. ఆతడు మాత్రమేమనెను?

బా: బంటనుట చాలదా?

శం: అందు దూషణ మేమున్నది?

బా: అధిక్షేపము దూషణమునకు ప్రాతిపదికము. విప్పిచెప్పిన అభేదము.

శం: నియమితుడనని నేనే చెప్పుకొని నప్పు డాతడు బంటనుట వలన వచ్చిన నష్టమేమి? అదియు నొక అలంకారమే యగునుకదా?

బా: బంటుబంటని తేపతేపకును ఎత్తిపొడుచుటవలన, అనగా అనగా ఎప్పటికేని, తమకును నాకును పొరపొచ్చెము కల్గినను దూర దృష్టితో, యీ జిత్తులమారి భేదోపాయమును పన్నుచున్నాడు. స్వామీ! నిజముగా తమకు నాకు సేవకులా? అవాచ్యము. అవాచ్యము. వరప్రదానము కృష్ణానుగ్రహమునకే అయినప్పుడు; తామా తనితో పోర సందేహించుచున్నప్పుడు నాకు తమవలన కలుగబోవు వ్యావహారిక ప్రయోజనము నపేక్షించి తమ్ము నియమించితిని కాని, అఖిల జీవులకును శాస్తలగు తమ్ము నేను శాసింపగలనా?

శం: బాణా! ఈతడు సర్వజ్ఞుడు. కృష్ణ పరిహాసము నా బాణ సహోద్యమమును మరల్పజాలదు.

బా: ప్రభూ! ధన్యుడను

శం: గోపాలా! జాగేల — ఏదీ, నీ అస్త్రము?

(కృష్ణుడు — శంకరుడు తెరప్రక్కకు పోదురు.)

బా: ఆహాహా! ఏమి యీ యుద్ధము? శస్త్రాస్త్రములు పుంఖానుపుంఖములు. ఉభయుల శరీరములును మోదుగపువ్వులైనవి. నా స్వామి ఎట్టిత్యాగము చేయుచున్నాడు! జయము మహాదేవా! సెబాసు! కృష్ణుడు మూర్ఛిల్లినాడు. ఔ బాణాసురా! హాహా! ఇదియేమి! వెంటనే లేచెనా? స్వప్నము కాదుకదా! ఏమి జరిగినది! స్వామీ! స్వామీ! (బాణ తెరప్రక్కకు పరుగెత్తును.)

(తెరపడును.)

5 వ అంకము — 3 రంగము.

స్వామీ! స్వామీ! స్వామీ! (అని బాణాసురుడు శంకరుని ...చేరును. శంకరు ...క ప్రక్క తెరలో నుండును. కృష్ణుడు ...క ప్రక్క తెరలో వుండును.) ఎంతటి ఘోరకృత్యమాచరించితిని! ...టి శంకరుడు! పెనుమూర్ఛను మునిగియున్నాడు. ఓహో! ...కై తనువు నర్పించిన ... మహాదేవుడే ...వుడు కాని ...మసి ...సకలరే! హా! శంకరా! బాణ... స్వార్థపరుడు! ...ల యుద్ధమునకు తలపడలేదు? స్వామీ! స్వామీ! స్వామీ! ...పు జాబిల్లి కందిపోయెనే! గంగాభవాని బాలుక బాలుకమని ...పిల్లుచున్నదే! మహాదేవా! నిన్ను వాడి నారాచముల నా ...హాతకుడు నొప్పించెనా? అహో! అమ్మవారెంత యాత్రిని ...చున్నది? తన్నుమ్మ యుద్ధమునకు పురికొల్పి యింతకు తెచ్చిన ...సుండిన నేమి మండిన నేమి?

ఒరే! కృష్ణా! కాచుకొమ్మురా! పాపీ! ఎన్నాళ్ళకు నాకు ...లనిండ పని కలిగినది? ఈ ప్రచండ ...ఘాతమును చవి ...గలవు. ఇన్నాళ్ళకు సరియగు తగిన శాస్తి కలుగును రా! ద్రోహీ! ...నుమనికై మహాదేవుని హింసించితివా? నేనే మహాశివభక్తుడ ..., అమ్మవారికే నాపై అనుగ్రహము కలిగిన, ఇదే పాశుపతాస్త్ర ...(ప్రక్క తెరలోనికి పోయి) పట్టుకొనిన దికదా! (తన ప్రక్క ...దగ్గరకు తిరిగివచ్చి) స్వామీ! స్వామీ! నా బాహువులతో ...లు పట్టుదునో! పాదముల నొత్తుదునో! తామిక ...నికై ...ద్ధమొనర్ప నక్కరలేదు.

కృ: (మూర్ఛ తేరి ప్రక్క తెరనుంచి ముందుకు వచ్చి వికటాట్ట హాసము చేయును.)

బా: ఓహో! విష్ణుచక్రమా! భయము లేదు.

శం: (బాణుని ప్రక్క తెరనుంచి ప్రవేశించి) ఏమి జరిగినది! ...త త్వరలో ఆతని... చక్రము పట్టించునంతటి యుద్ధ మొనర్చి

తివా! చక్రమునే ప్రయోగించెనా! ఓహో! భక్తున కెంత ప్రమాదము! బాణాసురా! నా వెనుకకు రమ్ము. దాని నాపుట బ్రహ్మకును నాకును తక్క ఎవరికిని సాధ్యము కాదు. రమ్ము బాణాసురా రమ్ము. భక్తాగ్రణీ! రమ్ము! నన్ను గెల్చిన కదా నిన్ను గెల్చుట!
(అని బాణుని వెనుకకు లాగును. బాణుడు రాడు)

బాణ: బాణప్రభువు యుద్ధమునకు తమ్ము నియోగించెను. తమ యుద్ధము ముగిసిపోయినది. స్వయముగా యుద్ధమునకు దిగిన బాణప్రభువు అసువులకై యొరుల మాటున దాగువాడు కాడు. ఇతడు శివశక్తి ప్రపూర్ణుడు. ఈతనిని చక్రమేమి చేయగలదు? ఈతడేమి చేయునో స్వామి చిత్తగించెదరు గాక! నాకై స్వామి హింసించి సడలను. నాడు వరము పూర్తియైనది. దానవజాతి భవిష్యత్తును బాణుడే నిర్ణయించుకొనవలెను.

శంక: ఇదియేమి బాణా! నీకు సాహాయ్యత హెచ్చు. కేశవుని మహోపద్రవమును గుర్తింపవు. (శివవంక చూచి) అహా! కేతనము పడినదా! బాణా! నీవు నాపూనికను దాటిన నేనే నీముందునకు వచ్చి యుద్ధపడెదను. సమరమును సల్పెదను. చక్రము నన్ను దాటికాని నిన్ను సమీపించుటకు వీలులేదు. సంగరము నాభక్తునది. శంకరుడు భక్తకింకరుడు.

కృష్ణా! ఎంతపని చేసితివి! చక్రమును నాపైననే ప్రయోగింపక పోతివా! నా భక్తుని యుద్ధము ముగియునదే? ఇప్పటిల ప్రయోగించితివి? ప్రళయ ఝంఝామారుతములు వీచుగాక! కుంభిని కంపిల్లు గాక! సప్తసాగరములు ఘూర్ణిల్లుగాక! ఈ చక్రము బాణుని సమీపింపక పూర్వమే, త్రిశూలమా! ఇంతవరకు ఎన్నడును చక్రముపై నిన్ను ప్రయోగించినది లేదు. ఇది పరీక్షాసమయము. శివకేశవుల శక్తి నిర్ణయము కావలెను. చతుర్దశ భువనములు చూర్ణములగు గాక! తేలవలసినది తేలవలసినదే. పొమ్ము త్రిశూలమా పొమ్ము.

(నారదుడు ప్రవేశించును)

నా: కృష్ణా! చక్ర ముపసంహారింపుము.

కృ: వీలులేదు.

నా : మహాదేవా !

శం : జరుగనున్నది జరుగవలసినదే.

నా : అధికార పురుషులకే ఇట్టి సంఘర్షణము కలిగిన లోకము లాగునా ? చతుర్దశభువనములును స్వరూపము లేకుండ పోవుచున్నవి. హా ! విధీ ! త్రిమూర్తులలో నొకడవు. నీవుతక్క యీ ప్రళయమును తప్పింపగలవా రెవ్వరు ? లోకరక్షణ మొనర్పగల సమర్థులెవ్వరు ? తంత్రీ ! తమ్మిగద్దె దిగిరావో ! లోకకల్యాణ మొనగూర్ప రావో!

(బ్రహ్మ ప్రత్యక్షమగును.)

బ్రహ్మ : శివకేశవులారా ! అధికారపురుషులకు తమకీ కయ్యమేల? నారదా ! ఇట్టి ఉపద్రవమెట్లు కలిగినది ?

నా : ఏమని చెప్పను దేవా ! అనిరుద్ధుని కొనిపోవలెనని కృష్ణుని నిశ్చయము. తన్ను జయించి కాని నగరము ప్రవేశింప వీలులేదని శంకరుని తీర్మానము. ఎవరెనరకు తీసిపోదురు ప్రభూ ! జగత్తునకు వచ్చి నది కాని...

బ్ర : (ఆలోచించి) ఓహో ! జగడమర్థమైనది. కృష్ణా నీ చక్ర ముపసంహరింప రాదా !

కృ : వీలులేదు.

బ్ర : శంకరా ! నీవైన

శం : వలనుపడదు.

నా : చక్ర త్రిశూలములు తారసిల్లుచున్నవి. ఇక నిచ్చట మాటాడువారుకూడ నుండరు. ప్రళయమే సంభవించును.

బ్ర : ఇదే ధర్మమునుపై ఆనవెట్టి ఒక్కగడియ బ్రహ్మాస్త్రమును సంధించి రెంటి సంఘర్షణమును నిలుపుచున్నాను.

నా : ఓహో ! చక్రత్రిశూలములు చెరియొక ప్రక్క నిలిచి పోయినవి. అధికారపురుషులు సమానశక్తిమంతులు.

బ్ర : కృష్ణా ! శంకరా ! బాణా ! నేనొక ధర్మబద్ధమగు నిర్ణయ మును చేయుచున్నాను. ఎల్లరకు నంగీకారమే కదా !

మున్యాదు : ధర్మమును కాదనువా రెవ్వరు ?

బ్ర : బాణునిపై చక్రము ప్రయోగింపబడిన అనంతరము త్రిశూలము ప్రయోగింపబడినది. జీవుల ఆయువునకు కారకుడను నేను. బాణప్రాణములకు బాధ్యతనాది. శంకరుడు నగరరక్షకుడు. కృష్ణుని నగరమును చొచ్చుకొననీకుండ జేయు బాధ్యతనాది. శంకరుని విధ్యుక్తధర్మము నిర్వహింపబడుచున్నది. కాన త్రిశూల ముపసంహారింపబడవచ్చును.

శం : అవశ్య ముపసంహారించితిని.

బ్ర : అనిరుద్ధుని బంధించుటకు బాణుడు ప్రత్యక్ష కారణమే కాని ఆతనికి శాపముకలదు. గడువయినది. అతడును శాపవిముక్తుడై కావలివారలతో అనిచేసి గెలిచి చెరనుండి యీవలకు వచ్చుచున్నాడు. కాన అనిరుద్ధునికై పోరాడవలసిన అవసరము కృష్ణునికి లేదు. కాగా యుద్ధకారణము నశించినది. కృష్ణుని పోరాటమున కోడి బుద్ధిపూర్వకముగ అనిరుద్ధుని కృష్ణునికి వప్పగించినదియు లేదు. కృష్ణుని యుద్ధకారణము నశించి దండెత్తినప్పుడు, బాణునికి యుద్ధము లేదు. శివుని బాధ్యతయు లేదు.

నార : సమంజసముగా నున్నది. ఇదో అనిరుద్ధకుమారుడు.

(అనిరుద్ధుడు ప్రవేశించి నమస్కరించును.)

నారదుడు, త్రిమూర్తులు : చిరంజీవ.

బ్ర : చక్రము దివ్యాయుధము. త్రిశూలము కూడ నట్టిదే. కాని రక్షణామాత్రముగ నది ప్రయోగింపబడినది. రక్షణకు నేను బాధ్యతవహించితిని. కాన దాని ప్రయోజనము సిద్ధించినది. బాణుడు కండకావరమున ఈశ్వరు నంతటివానిని యుద్ధమున కాహ్వానించెను. ఆతడును కినిసి ఆతని బాహువులను తాను ఖండించుట కిష్టము లేక తన యంతవాడు ఖండించునని శపించినాడు. ఈశ్వర వాక్యము విష్ణుచక్రమంత సామర్థ్యముకలది. రెంటికిని ప్రయోజనము బాణబాహు ఖండనము. బాణుడును దానిని ధిక్కరించుటకు వీలు లేదు. పరమ శివభక్తుడు శివ వాక్యమున కన్యథాత్వము కోరునా ?

విష్ణువు చక్రముచే తన బాహువులను ఖండించె ననుకొనరాదు. చక్రము శివవాక్యమునకు సాధనామాత్రము; అంతియే. అందుచే బాణునకు ద్విబాహుత్వము స్థిరపరచి మిగిలినవి ఖండింపబడవలసిన విధి. ఇదే బ్రహ్మాస్త్రముపసంహరించితిని. చక్రమా!

బా: (పైనచూచుచు ప్రక్క తెరలోనికిపోయి మరల వచ్చును.)

నా: సహస్ర బాహువులును ద్విభుజావశేషముగా ఖండింపబడినవి. చక్రము కృష్ణుని చేరినది.

బ్ర: దాంపత్య లిఖితమును స్వయంగే ప్రవర్తిల్లును. ఉషానిరుద్ధులితఃపూర్వ వివాహితులు. వారికి శిశువును కలుగనై యున్నది. వారు దీర్ఘాయురుపేతులు. దాంపత్యము ధర్మవిరుద్ధమును కాదు. అదియును కాక వీరికి యెడబాటు కల్గించి సాధింపదగిన ప్రయోజనమును లేదు.

నా: యుక్తముగనే యున్నది.

బ్ర: ఉషా వ్యాజమున ఈపోరు సంభవించినది. కాని ఎట్లును భూభారము తగ్గవలసినదే.

నా: దేవా! బాణాసురునికి తాము దేవతా పక్షపాతమున చెప్పిరేమో యను అనుమానమున్నట్లు నా కనుమానము.

బ్ర: నారదా! నీకనుమానమే లేకున్న యిది యింతవరకెట్లు వచ్చును? బాణాసురుని వంటి భక్తుడు 'నభూతో నభవిష్యతి'. ఆతడీశ్వరునకు భక్తుడైనను త్రిమూర్తులకును భక్తుడయినట్లే. ఆతనివంటి యదృష్టవంతుడును లేడు. ఈశ్వరుడు నగరరక్షకుడు. విష్ణువు వియ్యంకుని తండ్రి. బ్రహ్మ అయాచిత సంధికారకుడు.

కాని ఆతని రక్తములో సాత్త్వికముల కన్న రాజస తామస జీవకణములే విశేషముగ నున్నవి. ఇతడు దానవుడగుటయే దీనికి కారణము. దేవదానవ విరోధ మాతని నరనరమునకును పట్టియున్నది. ఆతనికి సమత్వబుద్ధి కలుగుటకు బ్రహ్మజ్ఞానమును ప్రసాదించుచున్నాను.

కృ : నా భక్తుడగు ప్రహ్లాదుని వంశమున నీలడే వరమును పొందుట నా కెంతయు నభిమతము.

నా : త్రిమూర్తుల యెదుట నేనొకటి విన్నవించు కొనుచున్నాను. అధికారపురుషులు కదా ! ఈ ఆయుధము లేమి ! యుద్ధమేమి ? అరిషడ్వర్గములు కలవారివలె యీ ప్రసంగము లేమి ? యీ చిక్కు విడ తీయరా! తాము ను ప్రారబ్ధకర్మ వశవర్తులేనా ! అయిన విశేషమేమి?

బ్ర : నారదా ! ఈ విషయము నీకును తెలియనిది కాదు. లోక సంగ్రహమున కడుగుచుంటిని. అధికార పురుషులకు ప్రారబ్ధ మొప్పదును లేదు. కాని వ్యవహారమున నట్లుకన్పించకుండుటకు వీలులేదు. అధికారపురుషులుగా వ్యవహారమున కన్పించుట యే స్వభావము. రామావతారమున సీతకై రాముడు విలపింపలేదా ? దేవు హాల్కై ఏడ్పు లేమి ? పాత్రోచితముగ నుండుటయే కదా సృష్టినైశిష్ట్యము !

బా : మబ్బువిడిపోయినది. ఈ వెలుగుదారిలలో ఉషానిరుద్ధుల మున్వురు మూర్తులు ఆశీర్వదింప ప్రార్థనము.

త్రిమూర్తులు : అవశ్యము.

# ఉషా సుందరి

## 5 వ అంకము — 4 వ రంగము.

(త్రిమూర్తులు నొకప్రక్క నిలబడుదురు. వారికెదురుగ బాణుడును రాణియు నుందురు మధ్య, సభికుల కభిముఖముగ ఉషానిరుద్ధులు నిలబడుదురు. ఉష వెనుక చిత్ర రేఖ నిలబడును. త్రిమూర్తులకు కొలది దూరములో వారిప్రక్క నే సభికులకు దగ్గరగా నారదుడు నిలబడి గానము చేయును. అందరును చేతులెత్తి ఉషానిరుద్ధుల నాశీర్వదింతురు. నటీమణులు నృత్యముచేయుచు పూలజల్లుపట్టుదురు. చిత్రరేఖ మంగళహారతి నెత్తును.)

### భరత వాక్యము

భరత దేశమ్మె సర్వ ప్రపంచమునకు
శ్లోకమగు నేడు నుపసుమ స్నిగ్ధలచిలికి
విశ్వకల్యాణ మూర్తుల వేదవాక్కు
పరిమళింపజె చిత్కళల్ పండి కడల.

: : మంగళం : :





# తూణీరం

ఆధునిక కవుల కలాలు స్వేచ్ఛగా, క్రొత్త త్రోవల్లో పడి పరుగెత్తే పరుగుల కిది ఒక తార్కాణం...

కృష్ణాపత్రిక

—

క్రొత్తరకం విన్యాసం చూపించే కవితా గ్రంథం... పుస్తకం బాగానే వుంది...

ఆంధ్రవారపత్రిక

—

తెలుగు కవితా లోకంలో ఇది ఒక క్రొత్త గ్రంథం. ఈ కావ్యంలో ఒక తీవ్రత వుంది.... వేడి వుంది....

భారతి

—

జటాగ్ర్యసుందరిలో నడక ఝలాకీగా వుంది. గీతంలో జటాగ్ర్య పరుస ద్యోతకమవుతోంది. 'కృష్ణ' అన్న గేయం మధురంగా లాలిత్యంతో తొణికిసలాడుతూవుంది... కబడ్దార్ 'కబడ్దార్' అంటున్నట్టుగా అహంభావంతో నిండివుంది... పుస్తకం బాగుంది.

కథావీధి

—

ఈ తూణీరం నిండా మంచి గేయాలు ఉన్నాయి. కొన్ని గేయాలకు తాళం పడుతుంది. ఇందులోని ప్రతీ విషయం బాణం గుచ్చుకున్నట్లుగా నిశితంగా హృదయాన్ని స్పందింప చేస్తుంది. ముద్రణ కూడా ఆధునికంగా వుంది. కవిగారి కలం నడక చాల నిశితంగా వుంది. ఒక్కొక్కచోట హృదయం బద్దలయేటట్టు వ్రాసింది కలం. విన్యాసం, కబడ్దార్, చాలా బాగున్నాయి...

భారతమాత

—

తూణీరం! చక్కటి పేరు. నిశితాలైన భావాలు అక్షరాలై నిలచాయి అస్త్రాలై. వెళ్ళుతున్నప్పటి ఛాటీ ప్రొచ్ఛాయానికి కవి కలానికి గల చురుకుశక్తి ప్రస్ఫుటమవుతోంది. సాహిత్య రణరంగంలో యీ వీరుడెవరో గ్రహింపగల శక్తి కొంచెం కష్టమే అందరికీ.

అత్తిలి సూర్యనారాయణ మూర్తి, 25-11-41.

—

Dear Sir,

I thank you for so kindly sending me your book which makes very interesting reading. 25--12--44.

శ్రీ శ్రీ శ్రీ పిఠాపురం యువరాజావారు

---

THOONEERAM

...From the few pieces available here, he is Satiric to judge... and his sallies on wickedness of modernism are well delivered.

**Hindu.**



# దేశం

భారతదేశం, ఆంధ్రదేశం, రైతు, మొదలైన శీర్షికలతో జాతీయాభిమానంతో శాస్త్రిగారు చక్కగా గానం చేశారు.

ఆంధ్రదేశాన్ని గురించిన గీతాలు ఉద్రేకవంతంగాను, ఉపజ్ఞా సహితంగాను వున్నాయి.

ప్రజామిత్ర

---

...కవి కలం వెనకనుంచి దేశభక్తి వెల్లువగా ప్రవహిస్తున్నది.

కృష్ణాపత్రిక

---

This is a Collection of Poems, Patriotism, love of one's mother tone and one's province have inspired the author who sang the glories of 'Bharatavarsha' 'Andhra Desa' and 'Andhra Bhasha' in verse. In the verse entitled Rytu, the author Champions the cause of the down-trodden Indian Peasant and exhorts him to rise up and fight for his rightful place, while advocating a re-orientation in the outlook of his country-men, who must, in the author's view, recognize the fact that the toiling Peasant is the back-bone of the whole country.

**Indian Express 18-5-43.**

This little booklet of songs is intended to rouse the patriotic fervour of the Andhras. It has a section that sings of Mother India. Echoes of the Tamil poet Bharati may be heard here and there. Most of it, however, deals with the greatness of Andhra men and women and the Andhra country. The songs are written in simple emotional language.

Hindu 1-7-43.

—

సుల్తాన్ బజార్
హైదరాబాద్ (దక్కన్)
8—8—1942.

మిత్రులకు నమస్కారములు -

మీ 'దేశం' అనే చిన్ని పొత్తాన్ని కృతజ్ఞతతో అందుకొన్నాను. ఆ గీతాలను చదువుతుంటే నా శరీరం ఉప్పొంగిపోయినది. అతి సులభంగా ఉన్నదున్నట్లుగా కవిత్వం చెప్పి రసికుల హృదయ తంత్రుల కదలింపగలిగే శక్తి అగవారి పూర్వపుణ్య సుకృతమేనని చెప్పదగును. మీరిట్లే ఎన్నెనియును కృతుల వ్రాసి ఆంధ్రజాతి గౌరవమును ఆచంద్రార్కము నిలుచునట్లు చేయగలందులకు భగవంతుని ప్రార్థించెదను.

ఇట్లు
భ - విధేయుడు
పిశిపాటి వెంకటరమణయ్య

—

L. No. 62.

298, B. Canent Block,
Malakpet,
Hyderabad - D.
16—8—1942.

తాము రచించిన దేశమను గేయకావ్యమును మా మిత్రులగు కురుగంటి సీతారామయ్య గారికిని పిశుపాటి వెంకటరమణయ్య గారికిని పంపగా చదివి ఆనందించినాడను. శైలి మధురమై, దేశభక్తి పూరితమై గంగాలహరి వలె ప్రవహించుచున్నది. విను చుండగా ఒక విధమైన భావోద్రేకము సహజముగా కల్గినది. తద్గీతమును కంఠో పాఠముగా చదువవలెనని కాంక్షకలదు. కనుక నాకు కూడ ఒక ప్రతిని ఏ విధముగ నైనను వెంటనే పంపించగలరని నమ్ముచున్నాను. ఆంధ్రుల శోభను ప్రకటించు

గేయకావ్యములను ముందుకూడ ప్రకటించి ఆంధ్రలోకపు మన్ననలను బడయ గలుగుదురని నమ్ముచున్నాను.

ఇట్లు,
భవద్విధేయుడు,
క్రొవ్విడి వెంకటరత్న శర్మ.

---

దక్షిణ హైద్రాబాదు,
19 మార్చి 1943.

ఆర్యా, నమస్కారములు.

తాము వ్రాసిన 'దేశం' అను పుస్తకమును చూచి కొంత చదివి ఆనందించినాను. ఒక కాపీని నాకు పంపగోరెదను. ఆ ఖరీదు తెలియపరచిన పోస్టుబిళ్ళ ద్వారా తమకు పంపెదను. దీనిలా 'ఆంధ్రదేశం' అను మాలికను, నేనేగాక మాపిల్లలతో కూడా కంఠస్తవం చేయిద్దామని కోరిక.

చిత్తగించవలెను.
క్రొవ్విడి సుబ్బారావు,
271 C. I. B.
Special 'A'
Malakpet, Hyderabad (Deccan).

---

మల్యాల వెంకట సూర్యప్రకాశం పంతులు,
యల్. ఎమ్. పి.
పందవాశి, ఉత్తరఆర్కాట్ జిల్లా.

శ్రీ శా॥ శక ౧౮౬౫ స్వభాను సం॥రం శ్రావణ శు ౧౦ బుధవారం (11-8-1943)

శ్రీయుత విద్వాన్ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి సముఖమునకు.

మహాశయా!

నా కోరికపై తమరుపంపించిన దేశం పుస్తకము వెంటనే అందినను బహుతొందర పనులుండుటచేత వెంటనే జవాబు వ్రాయుటగాని; తుదకు తమకు పంపవలసిన దాని మూల్యము పంపుటగాని జరగలేదు. ఆలస్యమునకు మన్నించగోరెదను. ఇందుతో 0-8-0 తపాలుచీట్లు పంపుచున్నాను. ఇంతకంటె ఎక్కువ పంపుకొనజాలనందుకు చింతించుచున్నాను. తమ గ్రంథము బహు రమ్యముగాను; ప్రబోధకరముగాను వున్నది. దేశాభిమానమునకును ప్రోత్సాహమునకును ఇట్టి గ్రంథములు బాలురచే

వర్ణింప జేయబడి ప్రచారోత్సవములలో నుపయోగింప తగినవి. భగవంతుడు యింకను నిట్టి రసవంతములగు గ్రంథముల రచించుటకు తమకు ధీశక్తి ఆయురారోగ్యముల నొసగును గావుత అని శ్రియఃపతిని కోరి భజించెదను.

చిత్తగించవలెను,
మ. వెం. సూర్యప్రకాశం,
మెడికల్ ఆఫీసరు,
వంచవాశి, వయా - మద్రాసు.



## నీలం

ఇది ఒక కథల సంపుటి. సాధారణ సాంఘిక జీవనంలోని వివిధ ఘట్టాలను యథాతథంగా చిత్రించడానికి శాస్త్రిగారు కృషిచేశారు. కథారచనలో ఒక స్థానాన్ని శాస్త్రిగారు ఆక్రమించుకోగలరని యీ కథలు ఋజువు చేస్తున్నాయి.

ప్రజామిత్ర.
18—4—1943.

—

This booklet is a Collection of four stories, dealing with mishaps, in love and marriage. The author has a rare capacity for creating pathos. The language is somewhat provincial, but is throughout racy.

Hindu.
2—5—1943.



## ఆంధ్రశ్రీ

ఈ పద్యకావ్యము ఆంధ్రుల ప్రశస్తిని వర్ణించునది. కవిత్వమిందు సాక్షీ అయినది... పైడిపాటి విద్వాన్ గారి కవిత తూణీరంలో కంటె దేశంలోనూ, ఆంధ్రశ్రీ లో మరీనూ, అభివృద్ధి మార్గాన్ని పరిగెట్టుతున్నది. కవికి తెనుగు సాహిత్య ప్రియులు ప్రోత్సాహ మిచ్చిన బాగు.

ఆంధ్రపత్రిక.

—

"గండపెండేరము" "డొక్కాదంపతులు" "రామదాసు" "త్యాగరాజు" "మాధవశర్మ" అను మకుటాలతో ఇందు అయిదు పద్యహారాలు వున్నయి. తెలుగునాట మహోజ్జ్వల చారిత్రులై వెలసిన మహనీయుల జీవితాలలోని అపూర్వ

ఘట్టాలను గానంచేస్తూ కవిగారు రచించిన యీ పద్యాలు ఆంధ్ర రసిక జన హృదయాలకు విందును గూర్చగలవని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇట్లే ఆంధ్ర మహోదయుల మహనీయ చరిత్రలను వ్రాసి కవిగారు ఆంధ్రశ్రీ ని వెలుగొందజేసి విరజిమ్మాలి...

ప్రజామిత్ర

—

ఆంధ్రదేశములోని కొందరు మహాపురుషుల యాత్మౌన్నత్యమును చాటగలది గావున దీనికి ఆంధ్రశ్రీ యని పేరుపెట్టినట్లున్నది. పెద్దనకు గండపెండేరము మహోత్సవము, రామదాసు రామకైంకర్యము, త్యాగరాజు నాదాను సంధానము, క్షత్రియ తేజము నెదిరించి బ్రాహ్మ తేజమును ప్రకటించిన మాధవశర్మ మహిమయు ఇందులో వర్ణింపబడినవి. గోదావరి మండలములో దానవీర ధర్మవీరములకు పేరుపొందిన కీర్తిశేషులైన డొక్కా దంపతుల చరిత్ర కూడ ఇందులో నున్నది. భాషాభావములు ప్రమాణ బద్ధములుగా నున్నవి. ఆంధ్రశ్రీ ని చాటుటకు, ఆంధ్రజ్యోతిని విలసిల్లచేయుటకును యీ చిన్నికావ్యము చేతనైనంత చేయూత నివ్వగలిగియున్నది.

1943 డిశంబరు : భారతి

—

This is the poetical treatise touching famous incidents and personages in Andhra life. The great event of Krishna Deva Raya Conferring the anklet of Victory on poet Peddana, the great generosity of the Docca Couple who served the Harijan in the great famine of 1876, the wonderful devotion of Ramadas that brought Tanisha into touch with the great name of Rama, the Chivalry of Madhavasarma in Protecting Princess-Siriyala Devi against an invading force are all sung in forty pages. It is an inspiring poem.

**Hindu.**

—

కమ్మని గొంతుతో వసంత గీతా లాలపించే కవి కుమారుల జీవనమే, నిజానికి జాతీయ జీవనం! ... మెత్తని గొంతుతో అతి నూత్న రాగాల నాలపించే కోయిల గానాలు విని ఆనందించి ఆశీర్వదించే అనుభవశీలురు అనుభవశాలురు అరుదు మన సీమలో. అయినా ఏ కోయిల ఒకరి కోసం పాడుతుంది? తన దాహం తీర్చేందుకు తన గుండె నిండేందుకు తప్ప!! మన తెలుగు తోటలో విహరించే అలాంటి వయసు కోయిలలో శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారొకరు. వీరు తమ తీయటి గొంతుతో ఒకరికోసం కాదన్నట్లుగానే అతి మధురంగా కూహూ కూహూ నాదాలు చేస్తూవుంటారు.

Maharajah of
Jeypore.

Fort Jeypore,
(Orissa) 7-3-45.

ఆ శ య ము

నాకు దీటికలేమి పండిత శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి 'ఆంధ్రశ్రీ' ని సాంతముగాఁ జదువఁజాలనైతిని. నేఁజదివిన భాగములు నాకుఁ దృప్తిఁగలిగించెను. విషయము యుక్తమైయుండుటవలన నది యవశ్యపఠనీయము.

ఇట్లు,
శ్రీ విక్రమదేవ వర్మ.

---

తణుకు,
4—4—44.

మిత్రమా! సమస్కారములు.

తమ ఆంధ్రశ్రీ పెనుగొండలో విన్నాను. మీరుపంపిన పుస్తకమంతా తనివితీరక మరలమరల చదివినాను. చాలా ఆనందించినాను. వెంటనే నా ఆనందము తెలుప నందులకు మన్నింపుడు. పరమేశ్వరుడు మీకు సంపూర్ణాయురారోగ్యముల నొసంగి యింకను పలుగ్రంథములు మీచే వ్రాయించును గాక. మీ మైత్రికి కృతజ్ఞుడను. క్షేమము తెలుపుచుండుడు.

చిత్తగింపుడు, విధేయుడు,
పెనుమత్స సత్యనారాయణరాజు,
పండిట్ - హైస్కూలు

---

బులుసు వేంకటేశ్వర్లు, బి. ఎ.,
Pundit, Telugu Lexture Office,
సూర్యారావుపేట - కాకినాడ, 4.4.44.

మహాశయా!

నా కోరికపై తాము దయతో పంపిన తమ గ్రంథములు నాలుగును (నీలం, తూణీరం. దేశం, ఆంధ్రశ్రీ) సకాలముననే చేరినవి. అందులకు తమకెంతయు కృతజ్ఞుడను. విషయాంతరమగ్నుడ నగుటచే తమకు వెంటనే వ్రాయజాలక పోయినందులకు మన్నింతురు గాక.

తమ గ్రంథములఁ బఠించి యెంతయు నానందించితిని. అందు ముఖ్యముగా సలక్షణమైన "ఆంధ్రశ్రీ" అమిత హృదయామోదము నొనగూర్చినది. ఉత్తమాంధ్ర రత్నముల నుత్తమ భాషాసంప్రదాయములతో సుత్తమభంగి గ్రంథస్థ మొనర్చిన తమ లేఖిని యెంతయు ప్రశంసార్హము. ఆంధ్రభాషా యోష కీర్తి తామెనంగిన, ఒసంగుచున్న

అమూల్యాలంకారము లవిరళరత్నద్యుతులతో నొప్పారగలవని నా దృఢవిశ్వాసము. ఇతోధిక భాషాసేవకు పరమేశ్వరుడు తమ్ము పురికొల్పు గాక.

చిత్తగింపుడు,
బులుసు వెంకటేశ్వర్లు.

---

ఏలూరు,
9—8—1936.

## అవధానములు

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు నిర్వ్యాజకవి యింతకుమున్ను మా హైస్కూలు పురపు టున్నత పాఠశాలలోని విద్యార్థియై స్కూలుఫైనలున గృతార్థతం జెందె అక్కాలమందే యాంధ్రభాషయం దధికాభిలాషియై పద్యరచనల నల్లుచుండెడివాడు ఇటీవలం దెలుగున మిగులంగృషి యొనర్చి పెక్కు లష్టావధానంబులం గడిదేరె. ఇపుడు కృతజ్ఞతా సూచకముగా మా పాఠశాలయందే ప్రాథమిక శతావధానం బొనర్చి శ్లాఘాపాత్రుడయ్యె ననుట కెంతయు సంతసంబు. ముందుముం దీకవి నిరాఘాట శత శతావధానంబు లొనరించి యాంధ్రదేశ ప్రసిద్ధుడగుతమని యాశీర్వదింతును.

అష్టావధాని : నేతిసుబ్బరాయశాస్త్రి,
సీనియర్ పండితుడు, హైస్కూలు ఏలూరు.

---

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి విద్యార్థిదశలో నాంధ్రభాషయందును తద్భాషాధ్యాపకులయందును గడుంగడు శ్రద్ధాభక్తుల మెలంగుచు నప్పటికే కవిత్వమును జెప్పుచుండె. తత్ఫలితముగ నిక్కవి 28-3-1934 తేదిని మా పాఠశాలలో అష్టావధాని బ్రహ్మశ్రీ గరికపాటి మల్లావధానులుగారి యధ్యక్షతను జరిగెన విద్యార్థి బహూకరణ సభలో "కవికిశోర" అను బిరుదము నొందియుండెను.

మరియు నీ కైసరుడు, 6-8-36, 7-8-36 తేదీలలో అష్టావధాని బ్రహ్మశ్రీ నేతి సుబ్బయ్యశాస్త్రిగారి యధ్యక్షతను సభికుల కాహ్లాదకరముగ శతావధాన మొనరించి తాంజదివిన పాఠశాలయందు గల భక్తిని వెల్లడించెను. అవధానసమయమున ననేకులచే ననేకవిధముల నీయంబడిన క్లిష్టసమస్యలం జమత్కారముగం బూరించుట కవిసమయస్ఫూర్తిని జాటుచున్నది. ముఖ్యముగా, నీ యవధాని పండిత కవి హృదయసీమలయందు ధారాళముగ సంచరింపగలడని నా నమ్మకము.

ఈ శతావధాని కాయురారోగ్యాభివృద్ధుల ననుగ్రహించుటకు భగవంతునిం బ్రార్థించుచున్నవాడ.

మునిసిపల్ హైస్కూలు,
ఏలూరు, ప. గో. జిల్లా
9-8-36.

శ్రీమత్ప్రతివాది భయంకర కృష్ణమాచార్యులు
ఉభయభాషాప్రవీణ, తెలుగు పండితుడు.

ఈ సుబ్బరామశాస్త్రి మా స్కూలునకు పూర్వపు విద్యార్థి. మొదటి నుండియు నాంధ్రమునం దెక్కుడు ప్రీతిగలవాఁడు. iv ఫారమునకు వచ్చినది మొదలు కవితఁ జెప్పవలెననియెడి యుత్సాహముఁ గనబఱచుచుండెడివాఁడు. vi ఫారమునకువచ్చు నప్పటికి, రసవత్తరముగఁ బద్యములల్ల నేర్చినాఁడు. కొలఁదికాలములోనే యవధానము సేయఁదగు సమర్థుడైనాఁడు. ఈనెల 6, 7 తేదీలలో మా స్కూలునం దవధానము జేసియున్నాఁడు. పృచ్ఛకుల యభిప్రాయము ననుసరించి వర్ణనలను సమస్యలను పద్యములలో హృద్యముగ పూర్తిచేసి యున్నవాఁడు. వయస్సు పందొమ్మిదేండ్లు మించి యుండదు. ఇంత చిన్నతనమున నిట్లవధానము సేయుట యాశ్చర్యకరమైన విషయమనక తప్పదు. ఈశ్వరుఁ డీతని నితోధికముగా గొప్ప కవింజేసి ప్రోచుగాక యని కోరుచున్నాను.

ఇట్లు శ్రేయోభిలాషి

విద్వాన్, కందాడై గోవింద కృష్ణమాచార్యులు

తెలుగుపండితుడు.

---

ఈ అవధాని మా పాఠశాలలో పూర్వవిద్యార్థి. ఇతడు యీ నెల 6,7 తేదీలయందు మా పాఠశాలయందు అష్టావధాని బ్రహ్మశ్రీ నేతి సుబ్బయ్యశాస్త్రిగారి అధ్యక్షతను శతావధానము జయప్రదముగ నెరవేర్చెను. పద్యములు సులభశైలిని హృదయరంజకముగ నున్నవి. సమస్యాపూరణము సభ్యుల మనోభావమునకు సరిగనుండి చమత్కారయుక్తముగ నున్నది. పందొమ్మిదేడుల ప్రాయమునందు కవితాశక్తి కల్గినను ఆశువు చెప్పుట కష్టము. ఈయన అవధానము చేయుట ప్రశస్తము. ఈ బాలకవిని చిరంజీవిని చేయుటకును సద్గ్రంథ రచనను సాయపడుటకును పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు B. A., B. Ed.

M. H. School, Ellore.

---

అష్టావధాని బ్రహ్మశ్రీ గరికపాటి మల్లావధానులుగారు

శ్రీకరములైన తన కవితాకరముల
నంతరాయ పరాగంబు లణచు గజ్జు
వేలు పవధానముల నీకు విజయ మొసగి
రక్షసేయుత శ్రీ సుబ్బరామశాస్త్రి

ధారయు ధాటియు మేలగు
తీరున గడియించి తెలర తివిరి యిక సుధీ
వారము మెచ్చఁగ పాండితి
నేరిచి యవధానములను నెగడుము శాస్త్రీ

వెనుకన్ మీకాలమందు లక్ష్మణుడు తా విఖ్యాతుడై తెన్గులో
ఘనమౌ పద్యనిఘంటు వ్రాసి యశమున్ గైకొన్నవాడట్టులే
జనసమ్మాన్యకృతి ప్రపంచరచనా సంధాయివై సద్యశో
వసధుల్ పొంగఁగ జేయుమా గరిమ సుబ్బారామశాస్త్రీ ! వెసన్.

Municipal High School,
Ellore, 10-8-36.

This is to certify that Mr. Pydipaty Subbaramasastry, an old boy of this High School, entertained the students and teachers of this institution in a Satavadhanam performance held on the 6th and 7th of this month and that his Feats were all very much appreciated by the audience.

He is an intelligent young man, possessing extra-ordinary ablities in the art of Satvadhanam and he richly deserves help and encouragement at the hands of the public.

I sincerely wish him succers in his efforts and enterprises.

S. Venkatrama Iyer,
Head Master.

—

Ellore, W. G. Dt.

Mr. Pydipaty Subbaramasastry (Kavi Kisora) has successfully performed Astavadhanam and I had the honour of presiding over the function. He is smart and intelligent and his poetry is soft and sweet. He withstood very hard tests in that Avadhanam. Wish him godspeed in his enterprises.

**B. Kanakalingeswara Rao,**
B. A., B. L. Advocate.
28—5—1936.

